# నోరూరించే... మనసునుదోచే... మైమరపించే.






క్రొత్త పార్లే

# పాపిన్స్

## పండ్ల రుచిగల పిప్పరమెంట్లు

5 పండ్ల సువాసనలలో 13 మధురమైన బిళ్ళలు.
తక్కువ వెలగల మక్కువ గొలిపే ప్రతి ప్యాక్‌లో—
నిమ్మ, మూసంబి, నారింజ, అనాస మరియు రాస్ప్‌బెరి!

ఆ పండ్ల మజా తెలుసుకోండి పాపిన్స్‌నారగించండి-

everest/122b/PP Tel

# సరిగ్గా ఆడాడు...

























ఫోర్‌హాన్స్

దంతవైద్యునిచే సృష్టింపబడిన టూత్ పేస్ట్

49F-203R-TEL

# చిక్‌లెట్స్ వేడుకతో వుంచే చూయింగ్ గమ్

Chiclets LEMON 12 PIECES

Chiclets ORANGE 12 PIECES

Chiclets 12 PIECES

Chiclets 12 PIECES

వేడుక చూడు, వినోదం చూడు, మాధుర్యమైన చిక్‌లెట్ చూడు! తినగా, తినగా ఎంత రుచి, నాలుగు రకముల నచ్చే రుచి!

Chiclets

లెమన్
ఆరెంజ్
పెప్పర్‌మింట్
టుటీ-ఫ్రూటీ

WH. 3041






# చందమామ

సంస్థాపకుడు: నాగిరెడ్డి
సంచాలకుడు: 'చక్రపాణి'

ఈ సంచికతో "చందమామ" కు ఇరవై అయిదు సంవత్సరాలు నిండు తున్నాయి. జూలై సంచిక "రజతోత్సవ సంచిక"గా వెలువడుతుంది.

కరువులూ, కాటకాలూ మొదలైన ఈతిబాధలు చెలరేగినప్పుడు ఉన్నవారి కన్న లేని వారు అధికంగా బాధలకు గురి కావటమూ, నేరాలకు పాల్పడ టమూ కూడా సహజమే. ఏ నేరాలూ చెయ్యకుండానే బాధలకు గురి అయే వారు ఉంటారన్నది "అక్రమదండన" [బేతాళకథ] చెబుతున్నది.

సంపుటి 50 జూన్'72 సంచిక 6








అహో ప్రకృతి సాదృశ్యం
శ్లేష్మణో దుర్జనస్య చ,
మధురైః కోప మాయాతి,
కటుకై రుపశామ్యతి. 1

[దుర్జనుడికి, శ్లేష్మానికి స్వభావంలో పోలిక ఉన్నది. శ్లేష్మం తీపిచేత వృద్ధిపొంది, చేదుతో తగ్గినట్టుగానే దుర్జనుడు మంచి మాటలకు ఆగ్రహించి, తీక్షమైన మాటలకు తగ్గిపోతాడు!]

దాతృత్వం, ప్రియవక్తృత్వం,
ధీరత్వ, ముచితజ్ఞతా,
అభ్యాసేన న లభ్యంతే,
చత్వార స్సహజా గుణాః. 2

[దానశీలతా, ప్రియభాషణమూ, ధైర్యమూ, ఔచిత్యం తెలిసి ఉండటమూ అనే నాలుగు గుణాలూ సహజంగా కలగవలసిందేగాని, అభ్యాసం చేస్తే వచ్చేవి కావు.]

అభుక్త్వా మలకం పథ్యం,
భుక్త్వా తు బదరీఫలం,
కపిత్థం సర్వదా పథ్యం,
కదళీ న కదాచన. 3

[పరగడుపున ఉసిరికాయా, భోజనానంతరం రేగుపండూ, ఏ వేళనైనా వెలగపండూ తినటం మంచిది. అరటిపండు ఎప్పుడూ మంచిది కాదు.]

సహజగుణాలు

# నలుగురు బాటసారులు

విమలావతి అనే అమ్మాయి పెళ్ళి అయి, ఒక గ్రామంలో ఉండే తన భర్త ఇంటికి కాపరానికి వచ్చింది. ఆమె భర్త కోపిష్ఠి. అతను తన భార్యను కట్టుదిట్టాలలో పెట్టి, "నువు ఎవరితోనూ మాట్లాడకూడదు. నోరు మూసుకుని నీ పని నువు చూసుకో," అని హెచ్చరించాడు.

విమలావతి మంచి మాటకారీ, మంచి తెలివి తేటలు కలదీనూ. అందుచేత ఆమెకు తన భర్త చేసిన శాసనం బాధాకరమనిపించింది. అదీగాక ఆమెకు పుట్టింట ఉన్న కాలంలో అతిథులూ, అభ్యాగతులూ రావటమూ, వాళ్ళు చెప్పే కబుర్లు వినటమూ అలవాటు. ఇప్పుడు ఆమెకు అలాటిదేమీ లేదు. ఊరి వాళ్ళకు ఆమె భర్త సంగతి తెలుసు గనక, ఎవరూ ఆమెతో కబుర్లు పెట్టుకునే వాళ్ళు కారు. ఇతరులతో మాట్లాడటమూ, అతిథులను సత్కరించడమూ ఈ రెండూ విమలావతికి తీరని కోరికలై పోయాయి.

ఒకనాడు విమలావతి ఊరి బావిలో నీళ్ళు చేదుతూ ఉండగా అటుగా నలుగురు బాటసారులు వచ్చి బావినీ, నీళ్ళు తోడే స్త్రీనీ చూశారు. వారికి దాహంగా ఉన్నది. అందుచేత వాళ్ళు అంతదూరంలో నిలబడి, తమలో కెల్లా పెద్దవాణ్ణి ముందు దాహం తీర్చుకు రమ్మని పంపారు.

ఆయన విమలావతిని సమీపించి, "తాగటానికి కాసిని నీళ్ళు పోస్తావా, అమ్మా?" అని అడిగాడు.

"మీరు ఎవరు?" అని ఆమె ఆయనను అడిగింది.

"నేను బాటసారిని," అన్నాడా మనిషి.

"సృష్టిలో ఇద్దరే బాటసారులు. మూడో బాటసారి లేడే!" అంటూ విమల తన పని చూసుకోసాగింది.

ఆర్. కుమారస్వామి



మొదటి వాడు నీరు తాగకుండా బావి దగ్గర నిలబడి ఉండటం చూసి మరొకడు బావి దగ్గిరికి వచ్చాడు.

విమలావతి అతనితో, "ఈయన తాను ప్రయాణీకుడినని అబద్ధం చెబుతున్నాడు. మీరు కూడా మరో ప్రయాణీకుడు కాదు గద!" అన్నది.

ప్రయాణీకుడినంటే ఆ మనిషి నీరు పొయ్యడనుకుని రెండో వాడు, "నేనొక బీదవాణ్ణి," అన్నాడు.

"ప్రపంచంలో రెండు రకాల బీదవాళ్ళే ఉన్నారు. అందువల్ల మీ మాట నిజం కాదు," అంటూ విమలావతి తన పని తాను చూసుకోసాగింది.

మరి కొంతసేపటికి మూడోవాడు బావి వద్దకు వచ్చాడు. విమలావతి అతనితో, "వీరిద్దరూ ప్రయాణీకుడిననీ, బీదవాడిననీ అబద్ధాలు చెప్పారు. మీ రెవరు?" అన్నది.

"నేనొక మూర్ఖుణ్ణి," అన్నాడు మూడో వాడు.

"అబద్ధం. ప్రపంచంలో ఇద్దరే మూర్ఖు లున్నారు," అంటూ విమలావతి తన పని తాను చూసుకోసాగింది. చివరకు నాలుగో వాడు కూడా బావి వద్దకు వచ్చాడు.

"నువ్వు ఎవరు, నాయనా? వీళ్ళు ముగ్గురూ ప్రయాణీకుణ్ణనీ, బీదవాడిననీ, మూర్ఖుడిననీ అబద్ధాలు చెప్పారు. నువ్వయినా నిజం చెబుతావా?" అని విమలావతి అతన్ని అడిగింది.

"నేను బలవంతుణ్ణి," అన్నాడు నాలుగో వాడు.

"ప్రపంచంలో ఇద్దరే బలవంతు లున్నారు. నువు కూడా అబద్ధం చెప్పావు," అని విమలావతి తన బట్ట పిండుకోవటం పూర్తి చేసింది.

ఆమె నీళ్ళ బిందె ఎత్తుకుని ఇంటికి బయలు దేరుతూ, "పాపం, మీరందరూ దాహంగా ఉన్నట్టున్నారు. నీరు తాగి, మా ఇంటికి వచ్చి, భోజనం చేసి మరీ వెళ్ళండి," అని వారికి నీళ్ళు పోసి, తన వెంట వాళ్ళను ఇంటికి తెచ్చింది.

తన భార్య వెనకగా ఎవరో నలుగురు వస్తూ ఉండటం చూసి, ఒక కర్ర తీసుకుని బయటికి వచ్చి విమలావతి భర్త ఉగ్రుడై పోతూ, "ఎవరే వీళ్ళందరూ? ఎందుకు నీ వెంటపడి మన కొంపకు వస్తున్నారు?" అని అడిగాడు.

"వాళ్ళనే అడగండి," అంటూ విమలావతి ఇంటిలోకి వెళ్ళిపోయింది.

"అయ్యా, మేం ప్రయాణీకులం. దాహం వేస్తే మీ ఆవిడను నీరు అడిగాం. భోజనానికి పిలిస్తే వచ్చాం. నువు ఇలా కర్ర తీసుకుని మా మీదికి రావటం మర్యాద కాదు," అన్నారు ఆ ప్రయాణీకులు.

"ఆడదాన్ని నీళ్ళు అడుగుతారా? అంత చొరవా?" అంటూ విమలావతి భర్త వాళ్ళ మీదికి కర్ర ఎత్తాడు. బలాఢ్యుణ్ణని చెప్పుకున్న యువకుడు అతని చేతిలో నుంచి కర్ర లాగేసుకున్నాడు. ముష్టియుద్ధం సాగింది.

ఇది చూసి రాజభటులు వారందరినీ తీసుకు పోయి కొత్వాలు ఎదట పెట్టి, "వీళ్ళందరూ నడి వీధిలో కొట్లాడుకున్నారు," అని చెప్పారు.

అందరికీ తలా పది కొరడా దెబ్బలూ శిక్ష విధించాడు కొత్వాలు.

వాళ్ళ వెనకే వచ్చిన విమలావతి, "కొత్వాలయ్యా, నీ తీర్పు తప్పు. నువు ఒప్పుకుని, దెబ్బల శిక్ష రద్దు చేయకపోతే నీ మీద రాజుగారి దగ్గిర ఫిర్యాదు చేస్తాను," అన్నది.



"అలాగేపోయి ఫిర్యాదు చేసుకో!" అన్నాడు కొత్వాలు.

"రాజుగారు తీర్పు ఇచ్చిన దాకా శిక్ష అమలు చెయ్యకు," అంటూ విమలావతి రాజుగారి కొలువుకు పోయి, "కొత్వాలు అకారణంగా నా భర్తకూ, మరి నలుగురు ప్రయాణీకులకూ శిక్ష విధించాడు. మీరు కొత్వాలును విచారణ చెయ్యండి," అన్నది.

రాజు కొత్వాలునూ, మిగిలిన అయిదుగురినీ రప్పించి, కొత్వాలును అతను విధించిన శిక్ష గురించి అడిగాడు.

"వీళ్ళు నడి వీధిలో కొట్లాడుకున్నారు," అన్నాడు కొత్వాలు.

"వీళ్ళంతా ఎవరు? ఎందుకు కొట్లాడుకున్నారు?" అని రాజు అడిగాడు.

"కొత్వాలు ఆ మాట అడిగి ఉంటే నేను తమదాకా వచ్చేదాన్నా?" అంటూ విమలావతి బావి దగ్గిర జరిగినదంతా చెప్పి, "ఇందులో అపరాధం అంతా నాదే. నన్ను శిక్షించటానికి నా భర్త ఉండనే ఉన్నారు గద!" అన్నది.

"నువ్వన్న మాట నిజమే. కాని, ఇద్దరే ప్రయాణీకులూ, ఇద్దరే బీదవాళ్ళూ, ఇద్దరే మూర్ఖులూ, ఇద్దరే బలవంతులూ ప్రపంచంలో ఉన్నారని వాళ్ళతో అన్నావే, వాళ్ళెవరు?" అని రాజు అడిగాడు.

దానికి విమలావతి, "సృష్టిలో సూర్యచంద్రులే నిజమైన ప్రయాణీకులు; ఆవూ, కన్యా ఇద్దరే నిజమైన బీదవాళ్ళు; వరుణుడూ, వాయువూ ఇద్దరే బలవంతులు," అన్నది.

"ఇద్దరు మూర్ఖులూ ఎవరో చెప్పావు కావు," అన్నాడు రాజు.

"సంగతి సందర్భాలు తెలుసుకోకుండా తీర్పు ఇచ్చిన వాడూ, ఇంటికి వచ్చిన వాళ్ళపైన కర్ర ఎత్తిన వాడూ నాకు తెలిసిన మూర్ఖులు, మహారాజా!" అన్నది విమలావతి.

రాజు ఆమె మాటకారితనానికి ముచ్చటపడి, కొత్వాలును మందలించి, పెళ్ళాన్ని అర్థంలేని కట్టుదిట్టాలలో పెట్టవద్దని విమలావతి భర్తకు బుద్ధిచెప్పి, అందరినీ పంపేశాడు.





# పరమానందయ్యగారి గుఱ్ఱం

పరమానందయ్యగారూ, ఆయన శిష్యులూ లోక ప్రసిద్ధులు. ఒక రోజు గురువూ, శిష్యులూ మఠంలో కూర్చుని ఉండగా ఒక శిష్యుడికి ఒక గొప్ప ఆలోచన వచ్చింది. వాడు మిగతా శిష్యులతో, "మన గురువు గారు చాలా గొప్పవారు. వారికి తెలియని విషయం లేదు. వారికి వృద్ధాప్యం వచ్చేస్తున్నది. వారు కాలినడకన ప్రయాణాలు చెయ్యలేకుండా ఉన్నారు. అందుచేత ఎలాగైనా వారికి ఒక గుఱ్ఱం కొనిపెట్టాలి," అన్నాడు.

శిష్యులందరూ ఈ సూచన బాగున్నదని ఏకగ్రీవంగా ఒప్పుకున్నారు.

గురువుగారైన పరమానందయ్యగారు కూడా, "అలాగే కానియ్యండి. మీ వంటి శిష్యులుండగా నాకు లోటేమిటి?" అన్నాడు.

ఎత్తూ, లావూ, పొడుగూ, వెడల్పూ, రంగూ సరిగా ఉండే మంచి గుఱ్ఱాన్ని చూసి సంపాదించటానికి ఇద్దరు శిష్యులు నియోగించబడ్డారు.

ఈ ఇద్దరు శిష్యులూ బయలుదేరి వెళ్ళగా, వెళ్ళగా వారికి ఒక కోనేరూ, కోనేరు పక్కన పచ్చటి పొలాలూ, ఒక పొలంలో మేస్తూ కొన్ని గుఱ్ఱాలూ కనిపించాయి. గుఱ్ఱాలు మేసే ప్రదేశంలోనే అనేక గుమ్మడి పాదులూ, వాటికి పెద్ద పెద్ద కాయలూ ఉన్నాయి.

"గుఱ్ఱం కొనాలంటే చాలా డబ్బు ఖర్చు అవుతుంది. ఇక్కడ గుఱ్ఱపు గుడ్లు చాలా ఉన్నాయి. ఒక మంచి గుడ్డును కొని పట్టుకు పోయి, పొదిగి పిల్లను చేస్తే చాలా తక్కువ ఖర్చులో గురువుగారికి గుఱ్ఱం ఏర్పాటవుతుంది," అని ఆ ఇద్దరు శిష్యులూ అనుకున్నారు.

వాళ్ళు గురువుగారి వద్దకు తిరిగి వెళ్ళి, "అయ్యా, ఒక చోట మాకు గుఱ్ఱాల గుడ్లు

పి. రాజయ్య

కనిపించాయి. ఒక గుడ్డు కొని, పొదిగి, పిల్లను చేస్తే మనకు చవగ్గా గుర్రం వస్తుంది. ఏమి సెలవు ?" అని అడిగారు.

"భేష్! భేష్! మీ ఆలోచన దివ్యంగా ఉన్నది. కాని గుర్రం గుడ్డును పొదగటం ఎలా?" అన్నాడు పరమానందయ్యగారు.

శిష్యులంతా చాలా సేపు ఆలోచించి, రోజుకు ఒక శిష్యుడు చొప్పున గుర్రం గుడ్డు నుంచి పిల్ల వచ్చేదాకా పొదగటానికి నిశ్చయించారు. తరవాత కొంత డబ్బు తీసుకుని మొదటి శిష్యులిద్దరూ గుమ్మడి కాయలున్న చేనుకు వెళ్ళి, అక్కడ ఉన్న రైతును, "ఈ గుర్రం గుడ్డు ఖరీదెంత?" అని అడిగారు.

వాళ్ళు మూర్ఖులని గ్రహించి రైతు వెట కారానికి, "ఈ గుర్రం గుడ్డు ఖరీదు ఇరవైరూపాయలు," అన్నాడు.

"ఓస్, ఇంతేనా?" అని వాళ్ళు రైతుకు ఇరవై రూపాయలిచ్చి గుమ్మడికాయ కొన్నారు. ఆ ఇద్దరిలో ఒకడు దాన్ని నెత్తిన పెట్టుకుని తిరిగి వస్తూండగా వాడి కాలికి రాయి తగిలింది. వాడు కాయతోసహా కింద పడ్డాడు. కాయ పగిలింది. అదే సమయంలో సమీపంలో ఉన్న కుందేలు ఈ అలికిడికి భయపడి పొదలో నుంచి బయటికివచ్చి పరుగెత్తసాగింది.

"ఒరె, ఒరె! గుడ్డు పగిలి పిల్ల బయటికి వచ్చింది. గుడ్డు నుంచి బయటికి వస్తూనే ఈ గుర్రం పిల్ల ఇంత వేగంగా పరిగెత్తుతున్నదంటే ఇది పెద్దదైతే మేఘాల మీద పోతుంది గాని, నేల మీద నడుస్తుందా?" అనుకుని పరమానందయ్య శిష్యులు కుందేలును పట్టుకుందామని దాని వెంట పడ్డారు. కాని అది దొరకలేదు.

శిష్యులు ఒక చోట ఊపిరి అందేదాకా విశ్రాంతి తీసుకుని, తాపీగా మఠానికి తిరిగి వెళ్ళి, జరిగిన సంగతి మిగిలిన శిష్యులకూ, గురువుగారికీ తెలిపారు.

"పోనివ్వండి, ఏం చేస్తాం? ఇంతకూ నాకు గుర్రం ఎక్కే అదృష్టం లేదు," అని పరమానందయ్యగారు తన శిష్యులను ఓదార్చాడు.






# యక్షపర్వతం

## 2

[ ఖడ్గజాతి వాళ్ళ పంటపొలాలను బందిపోట్లు దోచుకుపోతున్నారని కబురు వచ్చింది. ఖడ్గజాతి వాళ్ళు మంత్రి నాయకత్వాన బందిపోట్లను ఎదిరించబోయారు. ఆ సమయంలో చెట్లకొమ్మల్లో వున్న వాడొకడు వాళ్ళకు ధైర్యం చెప్పబోయాడు. బందిపోట్ల నాయకుడు చెట్టు కిందికిపోయి ఈటె ఎత్తి అతణ్ణి దిగిరమ్మని హెచ్చరించాడు. తరవాత—]

బందిపోట్ల నాయకుడి ముఖలక్షణాలూ, అతడు ఈటె ఎత్తి ఝుళిపిస్తున్న తీరూ చూసి స్వర్ణాచారి తనకు చావు తప్పదనుకున్నాడు. ఖడ్గజాతి వాళ్ళు ఆ చుట్టుపక్కల ఎక్కడా లేరు. వాళ్ళు ప్రాణాలరచేత పెట్టుకుని అరణ్యపురం కేసి పారిపోతున్నారు. ఇప్పుడు తను చెట్టు దిగకపోతే ఎక్కువ ప్రమాదమా? దిగితే ఎక్కువ ప్రమాదమా? అని ఆలోచించసాగాడు స్వర్ణాచారి.

"ఒరే, యింతకు ముందు అంత తెలివిగా మాట్లాడినవాడివి, ఇప్పుడు మతిలేని వెధవలాగా తలాడిస్తూ నా కేసి చూస్తావేం? కొమ్మల్లో నుంచి కిందికి దిగి వస్తావా, ఈటె విసరమంటావా?" అన్నాడు బందిపోట్ల నాయకుడు పళ్ళుకొరుకుతూ.

ఆ హెచ్చరికతో స్వర్ణాచారి మరింతగా భయకంపితుడైపోయి, చెట్టు మీది నుంచి కిందికి దిగుతూ, "అయ్యా, అనవసరంగా




నన్ను చంపి పాపం కట్టుకోకండి. ఇంతకు ముందే చెప్పాను గదా, నేను వాస్తుశాస్త్రజ్ఞుణ్ణి. రాజప్రాసాదం దగ్గిర్నుంచి, పేద రైతు గుడిసె వరకూ ఏ వాస్తు దోషం లేకుండా నిర్మించగలను," అన్నాడు.

ఆ మాటలకు బందిపోట్ల నాయకుడు పెద్దగా నవ్వి, "నువ్వు వాగే వాగుడుకేమైనా సందర్భ శుద్ధి వున్నదా? నేను కొంపా గోడూ కట్టించాలనుకుని, నిన్నెతుకుతూ యీ అరణ్యంలోకి వచ్చాననుకున్నావా? ఛీ, వెధవా, దిగు ముందు!" అన్నాడు.

స్వర్ణాచారి మారు మాటాడకుండా చెట్టు దిగి కింద నిలబడ్డాడు. బందిపోట్ల నాయకుడు ఒంటె మీది నుంచి దిగకుండానే, అతణ్ణి ఓసారి పరీక్షగా చూసి, "నువ్వు చూడబోతే, ఆ ఖడ్గమృగాల మీద సవారీ చేసే వాళ్ళ జాతి మనిషిలా లేవు. ఇక్కడ ఈ కొండల్లో, అరణ్యాల్లో ఏం చేస్తున్నావు?" అని అడిగాడు.

"అయ్యా, మీ తెలివితేటలు అద్భుతం! నేను ఆ ఖడ్గజాతి వాణ్ణి కాదని మీరు సరిగానే గుర్తించారు. అసలు నాది పద్మపురం. గృహ నిర్మాణ వృత్తిలో బతుకు తెరువు అంత బాగా సాగక, యంత్ర నిర్మాణ రహస్యం కూడా తెలిసిన వాణ్ణి గనక, విఘ్నేశ్వరపూజారి అనే ఒక అర్చకుడితో కలిసి మాయ ఏనుగును సృష్టించాను. కాని, ఇద్దరు క్షత్రియ యువకుల కారణంగా ఆ వృత్తిలో గట్టి చావు దెబ్బతిని, పురం వదిలి యీ అరణ్యాలు పట్టాను." అన్నాడు స్వర్ణాచారి.

"ఒరే, నువ్వు ఏదో మహాపురుషుడవని నీ జన్మ వృత్తాంతం అంతా అడుగుతున్నాననుకుంటున్నావా ఏం, నీ సొంత గొడవంతా నాకు వినిపిస్తున్నావు? నే నడిగింది నువ్వీ ప్రాంతాల ఏం చేస్తున్నావని. ఆ సంగతి చెప్పు చాలు. నీకు తోడుగా అదేదో పురం అంటున్నావే — ఆ పురం వాళ్ళెవరైనా యిక్కడ వున్నారా?" అన్నాడు బందిపోట్ల నాయకుడు ఒంటె మీది నుంచి దిగి, ఈటెను స్వర్ణాచారి గుండెల కేసి గురిచేసి.

స్వర్ణాచారి ప్రాణభయంతో గజగజ వణికి పోతూ, "అయ్యా. నన్ను చంపకండి. మిమ్మల్ని విసిగించకుండా అంతా నాలుగు మాటల్లో చెప్పేస్తాను. ఇక్కడికి దగ్గర్లోనే ఒక పర్ణశాల వంటిది నిర్మించుకుని ఇద్దరు క్షత్రియ యువకులు నివసిస్తున్నారు. వాళ్ళకు కొంచెం దూరంలో కొండరాళ్ళతో ఒక కట్టడం కట్టుకుని నేనూ, విఘ్నేశ్వర పూజారీ వుంటున్నాం," అన్నాడు.

క్షత్రియయువకులు అన్నమాట వింటూనే బందిపోట్ల నాయకుడు, స్వర్ణాచారి ముఖం లోకి అనుమానంగా చూశాడు. తరవాత స్వర్ణాచారి చెప్పటం ముగించగానే, "ఈ దగ్గి ర్లోనే యిద్దరు క్షత్రియ యువకులు పర్ణశాల నిర్మించుకుని వుంటున్నారా? వాళ్ళు తపస్సు లాంటిది చేస్తున్నారా ఏం?" అని అడిగాడు.

"వాళ్ళకు తపస్సు చేయవలసిన ఖర్మేం పట్టింది. ఇద్దరూ యుద్ధ విద్యల్లో ఆరితేరిన వాళ్ళు. అడవిలో వేటాడటం, అవసరం కలిగినప్పుడు దుష్టశిక్షణా, శిష్టరక్షణా చేస్తుండటం వాళ్ళ నిత్యకార్యక్రమం," అన్నాడు స్వర్ణాచారి ఉత్సాహంగా.

"ఓహో, అలాగా!" అంటూ బంది పోటు నాయకుడు అవహేళనగా నవ్వి, "ఇప్పుడు మేం చేసిన పని—ఖడ్గజాతి వాళ్ళ పండిన పంటలు కొసుకు పోవటం దుష్ట



కార్య మవుతుందా? ఆ క్షత్రియ యువకు లకు యీ సంగతి తెలిస్తే ఏమంటారు?" అని అడిగాడు.

బందిపోటు తనం దుష్టకార్యాల్లో పరమ దుష్టకార్యమనీ, ఈ సంగతి వింటే క్షత్రియ యువకులు వూరుకోరనీ చెప్పాలనిపించింది స్వర్ణాచారికి. కాని, అలా చెప్పటం కోరి గొంతు కోయించు కోవటమే అని గ్రహించి అతడు తడబడే గొంతుతో, "అయ్యా. మీరు చాలా గొప్ప ధర్మసూక్ష్మానికి సంబంధిం చిన ప్రశ్న అడిగారు. దానికి జవాబిచ్చే అర్హత నాకు లేదు," అన్నాడు.

"బతికి పోయావ్!" అన్నాడు బంది పోట్ల నాయకుడు పెద్దగా ఖుసకొడుతూ.



తరవాత ఒక్క క్షణం ఆగి, "ఆ క్షత్రియ యువకులు వుంటున్న పర్ణశాల అన్నావే, అక్కడికి దారి తియ్యి. అంత మంచి వాళ్ళు ఈ అరణ్యంలో ప్రాణాలతో వుండటం మాబోటి వాళ్ళకు క్షేమం కాదు," అన్నాడు.

బందిపోట్ల నాయకుడి ఉద్దేశమేమిటో ఆ మాటల ద్వారా స్వర్ణాచారి గ్రహించాడు. ఆ క్షత్రియ యువకులిద్దరినీ హతమార్చా లని అతడు ఆలోచిస్తున్నాడు. ముందుగా ఆ యువకుల్ని హెచ్చరించటం ఎట్లా?

"ఏమిటాలోచిస్తున్నావ్? పారిపోవాలని చూస్తున్నావా? జాగ్రత్త! ఈటెకు గుచ్చి, చెట్టుకు వేలాడ తీస్తాను," అన్నాడు బంది పోట్ల నాయకుడు.

తానిక మాటలతో కాలయాపన చేయటం ప్రాణాపాయకరం అని గుర్తించి, స్వర్ణా చారి తాను చెప్పిన క్షత్రియ యువకులుండే పర్ణశాల కేసి బయలుదేరాడు. బందిపోట్ల నాయకుడు తిరిగి ఒంటె ఎక్కి, తన అను చరులిద్దరిని వెంట రమ్మని కేక పెట్టాడు.

ముందు స్వర్ణాచారీ, కొంచెం వెనకగా ఆ ముగ్గురు బందిపోట్లూ బయలుదేరి కొద్ది సేపటికల్లా, పర్ణశాల లాంటి ఒక ప్రదేశాన్ని సమీపించారు. పూల మొక్కలూ, ఫల వృక్షాలూ వున్న ఒక ప్రశాంత ప్రదేశం మధ్య ఒక చిన్న కుటీరం వున్నది. ఆ కుటీర ప్రాంతం చుట్టూ కంచె వున్నది. ఆ కంచె బయట ఒక ఆవు పచ్చిక మేస్తున్నది.

స్వర్ణాచారి వెనగ్గా ఒంటె మీద వస్తున్న బందిపోట్ల నాయకుడు ఆవును చూస్తూనే కళ్ళింత చేసి, "ఒరే, ఆచారీ! ఆ ఆవు పాడి ఆవులా కనిపిస్తున్నదే, దూడ ఎక్కడ?" అని అడిగాడు.

"అయ్యా, అది పాడి ఆవే. దూడ ఆ కంచెకు అవతల ఎక్కడో మేస్తూ వుంటుంది." అన్నాడు స్వర్ణాచారి. అతడికి ముందుగా క్షత్రియ యువకులకు శత్రు దాడి గురించి ఎలా హెచ్చరించటమా అన్న గడ్డు సమస్య ఎదురయ్యింది. మధ్యలో యీ బందిపోటు పాడి ఆవుల గురించి ముచ్చట లాడుతున్నాడు.

"అయ్యా, మీ రిక్కడే వుండండి. నేను ముందుగా ఆ కుటీరానికి పోయి క్షత్రియ యువకులున్నారేమో చూసి వస్తాను," అన్నాడు స్వర్ణాచారి ఎంతో అమాయకుడిలా ముఖం పెట్టి.

ఆ మాటలకు బందిపోట్ల నాయకుడు చిన్నగా నవ్వి, "ఒరే, నీ గుంటనక్క జిత్తులు నా దగ్గిర చెల్లవు. సింధు ఎడారుల నుంచి ఈ అరణ్యాలూ, కొండలూ చేరే లోపల నీ బోటి వాళ్ళను చాలా మందిని చూశాను. నువ్వు కంచె దగ్గిరే వుండి, ఆ క్షత్రియ యువకులు వినేలా, 'దూర దేశం నుంచి అతిథులు వచ్చారు!' అని కేక పెట్టు; తెలిసిందా!" అన్నాడు.

బందిపోట్ల నాయకుడి ఎత్తుగడ ఏమిటో స్వర్ణాచారికి అర్థమైంది. తను అతిథు లొచ్చారని కేక పెట్టగానే, యువకులిద్దరూ నిరాయుధులుగా కుటీరం నుంచి బయిటికి వస్తారు. అప్పుడు వాళ్ళను హతమార్చ వచ్చునని బందిపోటు ఆలోచిస్తున్నాడు. కాని, తాను వాడు చెప్పినట్టు కేక వేయక పోతే ఆపదలో చిక్కుకోవలసి వస్తుంది. ఏమిటి దారి?

"ఊఁ, కేక పెట్టి పిలువు. ఏమిటి అంతగా తటపటాయిస్తున్నావు?" అంటూ బందిపోట్ల నాయకుడు ఈటెను స్వర్ణాచారి వీపుకు గట్టిగా ఆనించాడు.



స్వర్ణాచారి పెద్దగా గొంతెత్తి, "ఒంటెల మీద దూర దేశం నుంచి అతిథులు ఎత్తి వచ్చారు!" అని కేక పెట్టాడు. తరవాత రెండు మూడు క్షణాల కాలం జరిగినా కుటీరంలో నుంచి ఎవరూ బయటికి రాలేదు.

"అయ్యా, క్షత్రియ యువకులు వేటకు వెళ్ళినట్టుంది!" అన్నాడు స్వర్ణాచారి, ప్రమాదం తొలిగిపోయిందని సంతోషపడుతూ.

"అనుమానం ఎందుకు, మరోసారి కేక వెయ్యి, చూద్దాం!" అన్నాడు బందిపోట్ల నాయకుడు.

స్వర్ణాచారి యీసారి మరింత బిగ్గరగా కేక పెట్టాడు. కుటీరంలో నుంచి ఎవరూ బయిటికి రాలేదు. బందిపోట్ల నాయకుడు



ఒంటె మీదినుంచి దిగి, తన అనుచరుడొకణ్ణి స్వర్ణాచారి పారిపోకుండా కాపలా వుండమని చెప్పి, రెండవ వాణ్ణి వెంటబెట్టుకుని, కంచె దాటి కుటీరం ముందుకు వెళ్ళాడు.

కుటీర ద్వారానికి అడ్డంగా వున్న వెదురు తడికె తాడుతో ఒక మేకుకు బయట గట్టిగా బంధించబడి వున్నది. దాన్ని చూస్తూనే బందిపోట్ల నాయకుడు, తన పక్కన వున్న వాడితో, "ఆ ఆచారి చెప్పిందే నిజం. ఆ క్షత్రియు లిద్దరూ ఇంటలేరు. మనం లోపలికి పోయి చూద్దాం, పనికొచ్చే విలువైన వస్తువులేమైనా దొరకవచ్చు!" అన్నాడు.

బందిపోట్లిద్దరూ ద్వారానికి బిగించి వున్న వెదురు తడికెను వెనక్కు తోసి కుటీరం లోపలికి వెళ్ళారు. లోపల వాళ్ళకు దోచుకునేందుకు విలువైన వస్తువు లేవీ కనిపించలేదు. గోడల నుంచి పులీ, ఎలుగూ, జింకా లాంటి మృగాల చర్మాలు వేలాడుతున్నవి. గోడకు ఒక మూలగా రెండు ఈటెలూ, కొన్ని విల్లంబులూ ఆనించి వున్నవి. కొక్కెం నుంచి రెండు ధనుస్సులు వేలాడుతున్నవి.

"వీళ్ళెవరో కాని మంచి విలుకాళ్ళలా వున్నారు. దూరం నుంచే శత్రువునుగాని, అడవి మృగాన్నిగాని కొట్టేందుకు బాణం కన్న గొప్ప ఆయుధం మరొకటిలేదు. మనం విలువిద్య కూడా కొంత నేర్చుకుని వుండటం మంచిది. ఆ విల్లంబులు తీసుకో!" అని హెచ్చరించాడు బందిపోట్ల నాయకుడు తన అనుచరుణ్ణి.

నాయకుడు యిలా హెచ్చరించగానే బందిపోటు ముందుకు పోయి అక్కడ వున్న రెండు ధనుస్సులనూ, అంబులనూ తీసుకుని కట్టగా కట్టి, భుజాన పెట్టుకున్నాడు. బందిపోటు నాయకుడు కుటీరం లోని అన్ని మూలలకూ పోయి బాగా వెతికి, అక్కడ విలువైన వస్తువు లేవీ కనబడక పోవటంతో నిరుత్సాహ పడిపోయి, తల పంచుకుని కుటీరం బయటికి వచ్చేశాడు.

"ఆచారీ! నువ్వు చెప్పే ఆ క్షత్రియ యువకులు ఆహారధాన్యాలు కూడా కుటీ

రంలో ఎక్కడా దాచినట్టు లేదే! పులి చర్మాలూ, జింక చర్మాలూ తప్ప అఖరికి ఏనుగుల దంతాలైనా ఎక్కడా కనిపించ లేదు. వాళ్ళు అడవి ఏనుగులను వేటాడరా?'' అన్నాడు బందిపోటు నాయకుడు.

''అయ్యా, ఆ క్షత్రియ యువకులు ఆహారం కోసం తప్ప ఏ అడవి జంతువునూ చంపరు. మీరు చూసిన పులిచర్మాలు, వాళ్ళు అత్మరక్షణ కోసం చంపిన పులులవి,'' అన్నాడు స్వర్ణాచారి.

''ఓహో, వాళ్ళకు ఏనుగు దంతం విలువ కూడా తెలియదన్నమాట!'' అన్నాడు బందిపోట్ల నాయకుడు యీసడిస్తున్నట్టు.

తరవాత అతడు ఆ దాపుల మేస్తున్న అవును తన అనుచరులకు చూపుతూ, ''ఒంటెపాలు తాగి తాగి ముఖం మొత్తుతున్నది. ఈ ఆవు మెడకు తాడు బిగించి వెంట లాక్కురండి. దాని దూడ ఎక్కడ?'' అంటూ చుట్టూ కలియచూడసాగాడు.

ఒక బందిపోటు ఆవు దగ్గిరకు పోయి దాని మెడకు తాడు తగిలించి ఒంటె కేసి లాక్కుపోసాగాడు. ఆవు మెడ గింజుకుంటూ పెద్దగా అరిచింది. ఆ అరుపు వింటూనే కుటీరం వెనక నుంచి దాని దూడ పరిగెత్తుకు వచ్చింది.

''ఈ ఆచారిని కూడా ఒంటె మీద ఎక్కించండి,'' అన్నాడు బందిపోట్ల నాయకుడు.



ఆ మాట వింటూనే స్వర్ణాచారి గడగడలాడిపోతూ, ''అయ్యా, నన్ను మీ వెంట తీసుకుపోకండి. నాకిక్కడే హాయిగా వున్నది. నా బతుకు యిక్కడే వెళ్ళబుచ్చుతాను,'' అన్నాడు.

''అదేం కుదరదు. మేం ప్రస్తుతం వుంటున్న కొండ చరియ ప్రాంతాల వాస్తుశాస్త్రం తెలిసిన వాడివి గనక, నువ్వు చక్కని గృహాలు నిర్మించాలి. కొద్ది కాలంలోనే మేమీ చుట్టుపక్కల నూరామడల వరకూ ఆక్రమించుకుని, అధికారం చెలాయించబోతున్నాం. ఇప్పుడు నువ్వు గృహాలు నిర్మించబోయే చోటు రాజధానీ నగరం అవుతుంది. నిన్ను తప్పక అస్థాన వాస్తు

శాస్త్రజ్ఞుణ్ణి చేసి గౌరవిస్తాను," అన్నాడు బందిపోట్ల నాయకుడు.

"అయ్యా, నాకలాంటి పదవులేమీ వద్దు. నన్నిక్కడే సుఖంగా...."

స్వర్ణాచారి మాట పూర్తి చేసే లోపలే బందిపోటొకడు అతడి గొంతు పట్టుకుని ఎత్తి ఒంటె మీద పడవేశాడు. స్వర్ణాచారి అక్కడ లేచి నిలబడి, "రక్షించండి! రక్షించండి!" అంటూ అరవసాగాడు.

స్వర్ణాచారి కేకలు ఆ కుటీర ప్రాంతానికి వస్తున్న అతడి మిత్రుడు విఘ్నేశ్వర పూజారి అనేవాడు విన్నాడు. అతడు స్వర్ణాచారికేదో ప్రమాదం సంభవించిందని గ్రహించి త్వర త్వరగా కుటీరాన్ని సమీపించాడు. అతడి దృష్టికి ఒంటెల మీద వున్న బందిపోట్లూ, స్వర్ణాచారీ, బందిపోట్లలో ఒకడు లాక్కుపోతున్న పాడి ఆవూ కనిపించాయి.

విఘ్నేశ్వర పూజారికి మెరుపులా ఒక ఆలోచన వచ్చింది. కుటీరంలో నివసించే క్షత్రియ యువకులు ఒక సింహాన్ని, పిల్లగా వున్నప్పుడే పట్టుకు వచ్చి, పెంచుతున్నారు. అది ఆ యువకులు కుటీరం దగ్గిర వున్న సమయాల్లో స్వేచ్ఛగా ఆ చుట్టు పక్కల తిరుగుతూ వుంటుంది. వాళ్ళు కుటీరంలో లేనప్పుడు దాన్ని కుటీరం వెనక వున్న కర్రల బోనులో వదిలి పోతూంటారు.

ఇప్పుడు విఘ్నేశ్వరపూజారికి ఆ సింహాన్ని బోనులో నుంచి వదలటం వల్ల స్వర్ణాచారినీ, పాడి ఆవునూ రక్షించవచ్చునన్న ఆలోచన కలిగింది. పాడి ఆవుకూ, సింహానికీ చాలా స్నేహం. ఆవు అరుపులు సింహాన్ని రెచ్చ గొట్టి, దానికి బందిపోట్ల మీదికి దూకేలా కోపం తెప్పించవచ్చు....

విఘ్నేశ్వరపూజారి పరుగు పరుగున పోయి బోనులోంచి సింహాన్ని బయిటికి వదిలాడు. అది బయిటికి వస్తూనే పెద్దగా గర్జించి, బందిపోట్ల కేసి వేగంగా దూకుతూ పరిగెత్తింది. దాన్ని చూస్తూనే ఒంటెలు బెదిరాయి. ఒక బందిపోటు పట్టుతప్పి ఒంటె మీది నుంచి కింద పడిపోయాడు. సింహం చెంగున ఎగిరి వాడి మీద పడి, గొంతు పట్టుకున్నది. --(ఇంకా వుంది.)





# అక్రమదండన

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవం లోని బేతాళుడు, "రాజా, నువు ఏ తప్పూ చేయకుండానే ఈ విధంగా శ్రమపడుతూ ఉండవచ్చు. ఈ లోకంలో ఏ అక్రమమూ చేయని వారు కూడా దుర్భరమైన కష్టాలు పడటం ఒక్కొక్కప్పుడు జరుగుతూ ఉంటుంది. అందుకు దృష్టాంతంగా నీకు యజ్ఞసోముడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను," అంటూ ఇలా చెప్ప సాగాడు:

యజ్ఞస్థల మనే అగ్రహారంలో యజ్ఞ సోము డనే ధనిక బ్రాహ్మణుడు ఉండే వాడు. ఆయనకు హరిసోముడూ, దేవ సోముడూ అని ఇద్దరు కుమారులు కలిగారు. ఆ పిల్ల వాళ్ళకు బాల్యం గడిచి ఉపన

## బేతాళ కథలు



యనం కాగానే యజ్ఞసోముడు తన ధనాన్ని పోగొట్టుకున్నాడు. తరవాత ఆయన భార్య పోయింది. ఆ తరవాత ఆయనే పోయాడు.

ఈ విధంగా యజ్ఞసోముడి కొడుకులు శాపం పెట్టినట్టుగా దిక్కుమాలిన వారయి పోయారు. వారి దాయాదులు అగ్రహారాన్ని కాజేశారు. ఆ పిల్లలకు బిచ్చం ఎత్తుకోవటం తప్ప మరొక బతుకు తెరువు లేకుండా పోయింది.

వాళ్ళ తల్లి పుట్టిల్లు చాలా దూరం. అయినా ఆ కుర్రవాళ్ళు ఉన్న ఊళ్ళో బతకలేక తమ తాతగారుండే అగ్రహారానికి బయలుదేరి, దారి పొడుగునా బిచ్చమెత్తుతూ తాతగారి ఊరు చేరారు. తమ తాతా, అమ్మమ్మా అప్పటికే చనిపోయారని వాళ్ళకు ఊరు ప్రవేశించగానే తెలిసింది. అయితే వాళ్ళ మేనమామలు, యజ్ఞదేవుడూ, క్రతుదేవుడూ అనేవాళ్ళు, వాళ్ళను ఆదరించి, చదువు చెప్పించ నారంభించారు.

కొద్ది కాలానికి ఆ మేనమామలకు కూడా దారిద్ర్యం వచ్చింది. వాళ్ళు తమ మేనల్లుళ్ళతో, "ఒరే అబ్బాయిలూ, మనం పేద వాళ్ళం అయిపోయాం. పశువుల కాపర్లను పోషించటం సాధ్యం కాదు. మీ రిద్దరూ మన పశువులను కాయండి," అన్నారు.

కుర్రవాళ్ళ గొంతుకలు దుఃఖంతో పూడి పోయాయి. వాళ్ళు చేసేది లేక, అలాగే అని చెప్పి, రోజూ పశువులను అడవికి తోలుకుపోయి మేపి, సాయంకాలం ఇంటికి చేర్చేవారు. ఇలా వాళ్ళు పశువులను కాస్తూ ఉండగా ఒక పశువును పులి ఎత్తుకు పోయింది. మరొక పశువును దొంగలు ఎత్తుకుపోయారు. మేనల్లుళ్ళ అసమర్థత చూసి, పేదరికంలో రెండు పశువులు పోయాయనీ మేనమామలు దిగులుపడుతూ ఉండగా, ఇంతకన్న ఘోరం జరిగింది. ఒకనాడు అడవిలో ఒక మేకా, ఒక ఆవూ పారిపోయాయి. అవి రెండూ యజ్ఞం కోసం ప్రత్యేకించినవి.

ఇది చూసి కుర్రవాళ్ళు భయపడి, మిగిలిన పశువులను వెంటనే ఇంటికిచేర్చి,

తప్పిపోయిన వాటికోసం మళ్ళీ అడవికి పరిగెత్తారు. అడవిలోకి చాలా దూరం వెళ్ళి నాక వాళ్ళకు మేక కళేబరం దొరికింది. దాన్ని పులి సగం తిని వెళ్ళిపోయింది.

"ఇది మన మామలు యజ్ఞం కోసం ఉంచుకున్న మేక. ఇది పులివాత పడిందంటే మన మామలకు చాలా కోపం వస్తుంది. ఈ మిగిలిన మేకను కాల్చుకుని తిన్నంత తిని, మిగిలినది తీసుకుని ఎక్కడికైనా పారిపోయి, భిక్షాటన చేసుకుని బతుకుదాం," అని వాళ్ళు నిశ్చయించుకున్నారు. వాళ్ళు అక్కడే నిప్పు చేసి మేకను కాల్చటం మొదలుపెట్టారు.

ఈలోపల మామలు పశువులు మధ్యాన్నానికే ఇల్లు చేరటం చూసి, మేనల్లుళ్ళ జాడ కానక, వాళ్ళను వెతుక్కుంటూ అడవిలోకి వచ్చి, వాళ్ళు మేకను కాల్చుకుంటూ ఉండటం చూశారు. వాళ్ళను చూసి మామలు మండిపడి, "దుర్మార్గులారా, మాంసం మీది ఆశతో, యజ్ఞానికని ఉంచిన మేకను చంపి తింటారా? మీరు బ్రహ్మరాక్షసులు అయిపొండి!" అని శపించారు.

మేనమామలను అంతదూరాన చూస్తూనే కాలిసత్తువ కొద్దీ పారిపోయిన ఆ అన్నదమ్ములు శాపవశాన బ్రహ్మరాక్షసులు అయిపోయారు. వాళ్ళు అరణ్యాలలో బ్రహ్మరాక్షసులుగా తిరుగుతూ, ఒకసారి ఒక



యోగిని తినబోయారు. ఆయన వారిని పిశాచాలు కమ్మని శపించాడు.

వాళ్ళు పిశాచాలుగా మారి ఒక బ్రాహ్మణుడి గోవును కాజేయటానికి ప్రయత్నించారు. ఆ బ్రాహ్మణుడు వాళ్ళను చండాలులు కమ్మని శపించాడు. ఆ మీదట వాళ్ళు విల్లూ, బాణాలూ ధరించి చండాలులై తిరుగుతూ, ఆకలి బాధతో అలమటించుతూ ఒక చోరులుండే గ్రామానికి వెళ్ళారు. గ్రామానికి కావలి ఉండే వాళ్ళు వీళ్ళను పట్టి, కొట్టి, దొంగలనాయకుడి వద్దకు తీసుకుపోయారు.

దొంగల నాయకుడు వారి కథ విని, జాలిపడి, వారి కట్లు విప్పించి, భోజనం పెట్టించి, "మీరు కూడా మాతోనే ఉండి

పొంది. మీకేమీ భయం లేదు. మీకు ఏ లోటూ ఉండదు," అని వారిపట్ల చాలా ఆదరం చూపాడు.

అది మొదలు ఆ అన్నదమ్ములు దొంగల వెంటే ఉంటూ, దొంగలతో కలిసి దొంగతనాలు చేస్తూ, తమ శక్తి సామర్థ్యాలతో దొంగల దళాలకు నాయకులు కూడా అయారు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, యజ్ఞసోముడి కొడుకులు ఏ తప్పు చెయ్యకుండా ఇన్ని పాట్లు పడటానికి కారణమేమిటి? వారిని లోకమంతా క్రూరంగా చూసినప్పటికీ దొంగలు వారిపట్ల ఆదరంతో ప్రవర్తించటానికి కారణం ఏమిటి? ఈ సందేహాలకు తెలిసి కూడా సమాధానం చెప్పక పోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "సామాజిక ధర్మంలో స్వార్థం వున్నది. అది అమలులో ఉన్న చోట ఆ వాతావరణమే మనిషి మంచి చెడ్డలను నిర్ణయిస్తుంది. స్వార్థపరులు తమకు నష్టం కలిసప్పుడు ఆగ్రహిస్తారు. యజ్ఞసోముడి కొడుకులకు కష్టాలు సంప్రాప్తమైన అసలు కారణం పరిస్థితులు. మేనమామలకు వారంటే ప్రేమ లేకపోలేదు, కాని వారి స్వార్థానికి దెబ్బ తగిలిన కారణంగా వాళ్ళు తమ మేనల్లుళ్ళకు భయంకరమైన శాపం ఇచ్చి, వారిని బ్రహ్మరాక్షసులు చేశారు. యోగి వారిని పిశాచాలు కమ్మనటమూ, బ్రాహ్మణుడు వారిని చండాలురు కమ్మనటమూ శాపాలు అనిపించుకోవు. ఒక విధంగా అవి వరాలే. బ్రహ్మరాక్షసి కన్న పిశాచి మేలు, చండాలుడు అంత కన్న కూడా మేలు. ఇక దొంగల ఆదరణ మాటకు వస్తే వాళ్ళు సంఘజీవులు. వారి సంఘంలో వ్యక్తిస్వార్థం లేదు. సమత్వం ఉన్నది. యజ్ఞసోముడి కొడుకులు తమను బాధించని వాతావరణంలో పడి, ఆ వాతావరణానికి అనుకూలంగా తాము కూడా దొంగతనాలు చేస్తూ సుఖపడ్డారు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)





# రాజుగారి జ్ఞాతి

ఒకప్పుడు వంగదేశాన్ని గొప్ప వివేకీ, ధర్మపరుడూ అయిన రాజు ఏలాడు. ఆయనది తరగని సంపద. దానికి తగ్గట్టే పేదలకు విరివిగా దానధర్మాలు చేసేవాడు. ఆయనను యాచించని వాడిది పాపం!

ఒకనాడు రాజు కొలువు తీరి ఉండగా ఒక పేద వృద్ధుడు ద్వారం వద్దకు వచ్చి, తనకు రాజదర్శనం కావాలన్నాడు.

"నువు ఎవరు? ఏం పని మీద వచ్చావు?" అని ద్వారపాలకులు ఆ వృద్ధుణ్ణి అడిగారు.

"నేను రాజుగారి జ్ఞాతిని. ఆయనతో అతి ముఖ్యమైన విషయం మాట్లాడాలి," అన్నాడు వృద్ధుడు.

ద్వారపాలకులు ఈ సంగతి చెబితే, రాజు తనకు తెలియని జ్ఞాతి ఎవరా అని ఆశ్చర్యపడి, ఆ మనిషిని లోపలికి పంపమన్నాడు. సభలో వారంతా కూడా రాజుగారి జ్ఞాతిని చూడటానికి కుతూహలంగా ఉన్నారు.

కొద్ది సేపట్లో వృద్ధుడు సభలోకి వచ్చి, రాజును సమీపించి, వంగి నమస్కారం చేశాడు. ఆయన చేతిలో ఒక కర్ర ఉన్నది. ఆయన చింకిబట్టలు కట్టుకుని ఉన్నాడు.

"ఎవరు నువు?" అని రాజు వృద్ధుణ్ణి అడిగాడు.

"మహారాజా, నేను తమ పెత్తల్లి కొడుకును. ఆ విధంగా తమ జ్ఞాతిని," అన్నాడు వృద్ధుడు.

రాజు నవ్వి, "కులాసాగా ఉన్నావా, అన్నా?" అని అడిగాడు.

"ఏం కులాసా, మహారాజా? నా జీవితం పూర్తిగా తారుమారు అయింది. దివ్యమైన నా ఇల్లు శిథిలమైపోతున్నది. నన్ను ఎంతో శ్రద్ధతో సేవించుకున్న నా ముప్పై ఇద్దరు సేవకులూ, ఒక్కొక్కరే జారుకున్నారు. బయటి పని ఇదివరకు ఇద్దరితో అయేదానికి ఇప్పుడు ముగ్గురు కావలిసి వస్తున్నది.

ఎల్. హనుమంతరావు

దగ్గిరగా ఉండిన ఇద్దరు మిత్రులూ దూరం వెళ్ళిపోయారు. దూరంగా ఉండిన ఇద్దరు మిత్రులూ దగ్గిర అయారు,'' అన్నాడు వృద్ధుడు.

''అయితే మరి నువు నా దగ్గిరికి ఎందుకు వచ్చినట్టు?'' అని రాజు అడిగాడు.

''మహారాజా, నా శేషజీవితం సుఖంగా జరగాలంటే తమ సహాయం అవసరం,'' అన్నాడు వృద్ధుడు.

రాజు కొంచెం సేపు ఆలోచించి వృద్ధుడి చేతిలో ఒక వెండి రూపాయ ఉంచాడు.

వృద్ధుడు నిరాశతో, ''మహారాజా, ఒక్క రూపాయే ఇచ్చారేమిటి? కనీసం వెయ్యి అయినా ఇస్తారనుకున్నాను. తమ ఈవిని గురించి ఎంతో గొప్పగా చెబుతారు. కాని, తమ జ్ఞాతి విషయంలో తమ కీర్తి నిజం కాలేదు,'' అన్నాడు.

''ప్రస్తుతం ఇంత కన్న ఇవ్వలేను, అన్నా. ఖజానా ఖాళీగా ఉన్నది. మరొక సారి రా. అప్పుడు చూద్దాం,'' అన్నాడు రాజు.

''ఖజానా నిండుకుంటే లంకకు వెళ్ళరాదా? అక్కడ అంతులేని బంగారం ఉన్నది,'' అన్నాడు వృద్ధుడు.

''లంకను చేరాలంటే సముద్రం దాటాలి గద! ఎలా దాటను?'' అన్నాడు రాజు.

''అదేమంత పెద్ద సమస్యకాదు. ముందు నన్ను లంకకు పంపితే నా వెనకగా తమరు కాలినడకన లంకను చేరవచ్చు,'' అన్నాడు వృద్ధుడు.



రాజు విరగబడి నవ్వి, ఖజానా నుంచి లక్ష రూపాయలు తెప్పించి వృద్ధుడికి ఇప్పించాడు. వృద్ధుడు సెలవు పుచ్చుకుని వెళ్ళిపోయాడు.

తరవాత సభలో వారంతా గుసగుసలు ప్రారంభించారు. తాము విన్న సంభాషణ వారికి కొంచెం కూడా అర్థం కాలేదు. రాజు గారిని అడగటానికి వాళ్ళు ఉడియుపడ్డారు. రాజే వాళ్లకు సంగతి అంతా వివరించాడు:

"ఈ ముసలివాడి సంగతి మీకు ఏ మాత్రమూ అంతుబట్టి లేదనుకుంటాను. ఆయన నా జ్ఞాతిననీ, నా పెత్తల్లి కొడుకు ననీ చెప్పుకున్నాడు. పెద్దమ్మా, చిన్నమ్మా అక్కచెల్లెళ్ళని వాడుక ఉన్నది గద. నేను లక్ష్మీపుత్రుణ్ణనీ, తాను దారిద్ర్యదేవతకు కొడుకుననీ ముసలివాడి తాత్పర్యం. అదే మాకు గల జ్ఞాతి సంబంధం. శిథిలమై పోతున్న అతడి ఇల్లు అతడి శరీరమే. అతని ముప్పై ఇద్దరు నౌకర్లూ అతని దంతాలు. అవి అన్నీ ఊడిపోయాయి. బయటి పనికి అదివరకు ఇద్దరే చాలేవారు గాని ఇప్పుడు ముగ్గురు కావలిసి వచ్చారంటే, కర్ర లేకుండా కాళ్ళ మీద తిరగలేకపోతున్నా డన్నమాట. పూర్వం దూరంగా ఉండి ఇప్పుడు దగ్గిరయిన ఇద్దరు మిత్రులు కన్నులు. పూర్వం దగ్గిరగా ఉండి ఇప్పుడు దూరమైనవి చెవులు. కళ్ళూ, చెవులూ సరిగా పని చెయ్యటం లేదు. వీటన్నిటి కన్న కూడా ఆయన తెలివిగా అన్నది చివరి మాట. లంకకు తనను పంపితే, సముద్రం ఇంకి పోతుందని. నేను కాలినడకన లంకకు వెళ్ళవచ్చుననీ అన్నాడు. ఖజానా ఖాళీ అయిందని నే నన్నందుకు ఆయన ఆ మాట అన్నాడు. తాను దరిద్రదేవత బిడ్డ కనకనే తాను వచ్చే సమయానికి తనకు ఇవ్వటానికి నా వద్ద డబ్బు లేకుండా పోయిందని ఆయన మాటల అంతరార్థం. ఈ ఒక్క మాట అన్నందుకే నేను ఆయనకు లక్ష రూపాయలు బహూకరించాను."

సభలో వాళ్ళు వృద్ధుడి మాటకారి తనానికీ, రాజుగారి తెలివితేటలకూ ఎంతో ఆనందించారు.



# తేడా లేదు

ఒక గ్రామంలో ఒక లక్షాధికారి ఉండేవాడు. అతను పిల్లికి బిచ్చం పెట్టని పిసినిగొట్టు.

ఒక బిచ్చగాడు ఊళ్ళ వెంబడి తిరిగి ముష్టిఎత్తుతూ ఆ గ్రామం చేరి, లక్షాధికారి ఇంటికి వచ్చాడు. ఇంటి ముందు అరుగు మీద లక్షాధికారి కూర్చుని ఉన్నాడు.

"బాబుగారూ, ధర్మం చెయ్యండి," అన్నాడు బిచ్చగాడు.

"లేదు పోరా!" అన్నాడు లక్షాధికారి.

"చింకి బట్ట ఏదన్నా ఉంటే ఇయ్యండి, బాబూ," అన్నాడు బిచ్చగాడు.

"లేదు పోరా!" అన్నాడు లక్షాధికారి.

"ఇంత తినేటందు కేమన్నా ఇప్పించండి," అన్నాడు బిచ్చగాడు.

"లేదు పోరా!" అన్నాడు లక్షాధికారి విసుగుగా.

"పోని ఓ బీడీముక్క దయచేయించండి," అన్నాడు బిచ్చగాడు వదలకుండా.

లక్షాధికారికి కోపం వచ్చి, "లేదు పొమ్మంటే నీకు కాదూ?" అన్నాడు.

"అయ్యా, ఇద్దరమూ ఒకటిగానే ఉన్నాం. నాతోపాటు రండి. ఇద్దరమూ కలిసి అడుక్కుందాం," అన్నాడు బిచ్చగాడు.

—నంద్యాల సుబ్బనరసయ్య.





# ఇద్దరు బిచ్చగాళ్ళు

దక్షిణదేశంలో ఒక ఊళ్ళో ఒక జంగం శంకరయ్యా, సాతాని రాఘవయ్యా స్నేహంగా ఉంటూ, బిచ్చానికి ఊళ్ళ వెంట తిరిగే టప్పుడు కూడా కలిసే తిరిగేవాళ్ళు. ఎక్కడ చీకటి పడితే అక్కడే ఆ రాత్రికి వుండి పోయేవాళ్ళు.

ఒకరోజు వాళ్ళు ఒక దూరగ్రామం చేరి, అక్కడి సత్రంలో బస ఏర్పాటు చేసుకుని, బిచ్చ మెత్తటానికి గ్రామంలోని చెరొక వీధికి వెళ్ళారు.

సాతాని రాఘవయ్య వీధి వెంట బిచ్చ మెత్తుతూ ఒక ఇంటి ముందుకు వచ్చి, "అమ్మా, బిచ్చం వెయ్యి," అని ఇంటా విడను అడిగాడు.

కూతురు చెప్పిన మాట వినక ఏడిపిస్తూ ఉంటే ఆ ఇల్లాలు, "అల్లరి చేస్తే నిన్ను ఆ సాతానికి ఇస్తాను," అని భయపెట్టింది. ఆమె వచ్చి బిచ్చం వేసినాక సాతాని వెళ్ళి పోక, "అమ్మా, మీ అమ్మాయిని ఇస్తానన్నావు గదా, ఇయ్యి," అని గుమ్మం దగ్గిర కూర్చున్నాడు.

ఆవిడకు కోపం వచ్చి, "అమ్మాయిని ఇవ్వాలా? మా ఆయన పొలం వెళ్ళాడు, తిరిగి వచ్చినాక ఇస్తాడులే," అన్నది.

ఇంటివాడు మధ్యాన్నానికి ఇల్లు చేరిన దాకా సాతాని రాఘవయ్య కదలకుండా అక్కడే కూర్చున్నాడు.

పొలంలో పని చేసి చిరాకుతో ఇంటికి వచ్చిన ఆ మనిషి, "ఏమే, ఈ మనిషికి బిచ్చం వేసి పంపక పోయావా? గుమ్మంలో కూర్చున్నా డెందుకూ?" అని భార్యను అడిగాడు.

"పిల్ల అల్లరి చేస్తూంటే మాట వరసకు ఈ సాతానికిస్తానని దాన్ని బెదిరించాను. ఆ మాట పట్టుకుని, పిల్లనియ్యమంటూ పొద్దుటి నుంచీ గుండ్రాయిలా అలా వాకిట్లో

షేక్ రంతుల్లా

కూర్చున్నాడు," అని భార్య తన భర్తకు చెప్పింది.

దానితో ఆ మనిషికి కోపం వచ్చి, చేతిలో ఉన్న ముల్లు కర్రతో రాఘవయ్యను చచ్చేట్టు కొట్టి పంపేశాడు. జంగం శంకరయ్యను కూడా కొట్టించాలని రాఘవయ్యకు దుర్బుద్ధి పుట్టింది.

రాఘవయ్య సత్రానికి తిరిగి వచ్చేసరికి శంకరయ్య పడుకుని ఉండి, "ఏం రాఘవయ్యా? ఇంత ఆలస్యమయిందేం?" అని అడిగాడు.

"ఆ వీధిలో రెడ్డిగారి యింట వాళ్ళమ్మాయి పుట్టిన రోజు పండగ చేసుకుంటూ నన్ను ఉండమని నిర్బంధించి, లడ్డులూ, గారెలూ, బూరెలూ తెగ పెట్టారు. తినలేక తినలేక తిన్నాను. నువు కూడా అటుగా వస్తావేమో అనుకున్నాను గాని రాలేదు," అన్నాడు రాఘవయ్య.

శంకరయ్యకు ఈ మాటలు వింటుంటే నోరు ఊరింది. "ఆ ఇల్లు ఎక్కడ?" అని రాఘవయ్యను అడిగాడు.

"తిన్నగా ఈ వీధినే పోతే కొబ్బరిచెట్టున్న ఇల్లు కనిపిస్తుంది. ఆ ఇంటికి వెళ్ళి, 'అమ్మా, అమ్మాయినిస్తానంటివే?' అను. అంతే!" అన్నాడు రాఘవయ్య.

లడ్డూలూ, గారెలూ తినాలన్న తొందరలో శంకరయ్యకు ఇలా ఎందుకు అనాలన్న అనుమానమైనా కలగలేదు. అతను రాఘవయ్య చెప్పిన ఇంటికి వెళ్ళి, అతను అనమన్నట్టే అన్నాడు.



"వెధవా, ఒకసారి తన్నితే సిగ్గురాలా? మళ్ళీ వచ్చావా?" అంటూ రైతు శంకరయ్యను చావచితక తన్ని పంపేశాడు.

శంకరయ్య సత్రానికి తిరిగి వచ్చి, రాఘవయ్యతో ఏమీ అనలేదు. రాఘవయ్య కూడా శంకరయ్యను ఏమీ అడగలేదు. కాని శంకరయ్యకు రాఘవయ్య మీద ఎలా పగ తీర్చుకోవాలా అని ఉన్నది.

అందుకు ఒక ఉపాయం తట్టింది. వెంటనే శంకరయ్య, "ఒరే రాఘవయ్యా, నీది నిలువు బొట్టు, నాది అడ్డ బొట్టు. అందుచేత ఈ ఇంటి కప్పులో ఉండే నిలువు వాసాలు నీవి, అడ్డ వాసాలు నావీనూ. నీ వాసాల మీద నావి ఉన్నాయి, చూసుకో," అన్నాడు.

"అలా ఉండటానికి వీల్లేదు," అని రాఘవయ్య కప్పుమీదికెక్కి, ఇంటి అడ్డ వాసాలన్నీ పీకేశాడు. వెంటనే శంకరయ్య తాను కూడా కప్పుమీదికి ఎక్కి నిలువు వాసాలన్నీ పీకేశాడు.

తరవాత ఇద్దరూ కూర్చున్నారు. అప్పుడు శంకరయ్య రాఘవయ్యతో, "ఇద్దరమూ చేరి కప్పు పీకేశాం. తెల్లవారగానే ఊళ్ళో వాళ్ళు వచ్చి అడుగుతారు. మనం ఏమీ మాట్లాడవద్దు. నాది అడ్డబొట్టు గనక నేను తల అడ్డంగా ఆడిస్తాను. నీది నిలువు బొట్టు గనక నీ తల నిలువుగా ఆడించు," అన్నాడు.

తల అడ్డంగా ఆడిస్తే కాదనీ, నిలువుగా ఆడిస్తే అవుననీ అన్న సంగతి రాఘవయ్య మరిచాడు.

తెల్లవారగానే ఊళ్ళో వాళ్ళు జరిగినది చూసి, గ్రామ పెద్దలను పిలుచుకు వచ్చారు. వాళ్ళు వచ్చి, "ఎవరు ఈ పని చేసినది?" అని అడగగానే జంగం శంకరయ్య తల అడ్డంగా తిప్పాడు. సాతాని రాఘవయ్య తల నిలువుగా ఆడించాడు. వాడే కప్పు పీకాడనుకుని అతన్ని బాగా చితకతన్నారు.

వాళ్ళిద్దరూ అక్కడినుంచి వెళ్ళి పోయేటప్పుడు రాఘవయ్య శంకరయ్యతో, "భలే పని చేశావే?" అన్నాడు.

"లేకపోతే నన్ను ఆ రైతు చేత ఎందుకు కొట్టించావు? ఇక ఎన్నడూ అలాటి పని చెయ్యకు," అన్నాడు శంకరయ్య.



# వెర్రిపిల్ల

ఒక గ్రామంలో ఒక గృహస్థుకు వెర్రిబాగుల కూతురు ఉండేది. ఆ పిల్ల వాగుడు వింటే ఎవరూ చేసుకోరు. అందువల్ల ఆమెకు సంబంధం కుదరటం చాలా కష్టమయింది. ఎవరన్నా పెళ్ళిచూపులకు వచ్చినప్పుడు నోరు మూసుకోమని తల్లిదండ్రులు నయానా భయానా ఎంత చెప్పినా లాభం లేకపోయింది.

ఒక రోజున ఎవరో పెళ్ళిచూపులకు వస్తున్నారని తెలిసి తల్లి ఆ పిల్లను ముస్తాబు చేసి, ఆమె మాట్లాడకుండా చేద్దామని, "చూడమ్మా, ఈ తమలపాకులు నీ దగ్గిర ఉంచుకుని, పెళ్ళికొడుకు గడప లోపలికి రాగానే వీటిని నోట్లో వేసుకో, నట్టింటోకి రాగానే నములు, మళ్ళీ గడపదాటి వెళ్ళిపోయాక ఉమ్మెయ్యి," అన్నది.

కొంత సేపటికి పెళ్ళిచూపులకు వచ్చినవాడు గడప లోపలికి అడుగు పెట్టాడు. అది చూసి వెర్రిబాగుల పిల్ల, "గడప లోపలికి వచ్చాడే! నోట్లో వేసుకోనా?" అని కేకపెట్టింది.

ఈ మాట విన్న పెళ్ళికొడుకు కొంత బెదురుతూ నట్టింటోకి వచ్చాడు.

"నట్టింటోకి వచ్చాడు, నములుతున్నా!" అన్నది వెర్రిబాగులది.

ఈ మాటకు హడలిపోయి వాడు బయిటికి పరిగెత్తాడు.

"గడపదాటాడే! ఉమ్మెయ్యనా?" అని వెర్రిబాగుల పిల్ల మళ్ళీ కేక పెట్టింది.

పెళ్ళికొడుకు వెనక్కి తిరిగి చూడకుండా పారిపోయాడు. —వల్లూరు.






# చెరపకురా చెడేవు!

ఒక ఊళ్ళో ఒక పేద ముసలివాడు ఉండే వాడు. వాడికి పాపయ్యా, కన్నయ్యా అని ఇద్దరు కొడుకులు. వారికి ఉన్న ఆస్తి కొద్ది పాటి ఇళ్ళస్థలమూ, కొన్ని కోళ్లూ, ఒక కుక్కా మాత్రమే.

ముసలివాడు చనిపోతూ తన కొడుకు లిద్దరినీ పిలిచి, "నాయనలారా, నా అనం తరం మీ రిద్దరూ తగాదాలు పడకుండా మన కున్న కొద్దిపాటి ఆస్తిని పంచుకుని సుఖంగా బతకండి. ఒకరి నొకరు మోసం చేసుకోవద్దు," అని హితబోధ చేశాడు. అన్న దమ్ములు ఇద్దరూ అలాగే చేస్తామన్నారు.

తండ్రి చనిపోయిన తరవాత వాళ్ళు తమ ఇళ్ళస్థలాన్ని చెరి సగం పంచుకుని, చెరొక గుడిసే వేసుకున్నారు.

పెద్దవాడైన పాపయ్యాకు కోళ్ళన్నిటినీ తానే కాజేయాలన్న దుర్మార్గపు టాలోచన కలిగింది. కుక్కను మేపటం శుద్ధదండగ; కోళ్ళయితే, అవి పెట్టే గుడ్లు అమ్ముకుని, త్వరలోనే బోలెడంత డబ్బు పోగుచెయ్యా వచ్చునని అతను ఆలోచించాడు.

ఈ ఆలోచనతో అతను తమ్ముడైన కన్న య్యతో, "తమ్ముడూ, నాన్న మన ఇద్దరినీ తగాదాలు లేకుండా ఆస్తి పంచుకోమన్నాడు గదా! అందుచేత కోళ్ళను నా కిచ్చి, వాటి కన్న ఎన్నోరెట్లు విలవైన కుక్కను నువు తీసుకో. దాని సహాయంతో నువు ఎంతైనా సంపాదించవచ్చు. ఏమంటావు?" అన్నాడు.

అమాయకుడైన కన్నయ్య అందుకు సంతోషంతో అంగీకరించి, తన వాటా కింద కుక్కను తీసుకున్నాడు. మర్నాటి నుంచీ పాపయ్య కోళ్ళను పెంచుతూ, అవి పెట్టే గుడ్లు అమ్ముకుని, సుఖంగా జీవించ సాగాడు.

కన్నయ్యకు మాత్రం తాను ఎలా బత కాలన్న సమస్య త్వరలోనే ఎదురయింది.

జి. సాంబిరెడ్డి

అతను తినటమే గాక, కుక్కకు కూడా తిండి పెట్టాలి. అందుచేత అతను కుక్కను తీసుకుని అడవికి వేటకు వెళ్ళాడు. కుక్క సహాయంతో అతను ఒక లేడిని కొట్టి, దాన్ని తీసుకుపోయి పట్నంలో మంచిధరకు అమ్మేసి, తనకు కావలిసిన సరుకులన్నీ తెచ్చుకున్నాడు.

ప్రతి రోజూ కన్నయ్య ఇలాగే అడవికి వెళ్ళి ఏదో జంతువును వేటాడి పట్నంలో అమ్ముకుని, త్వరలోనే చాలా డబ్బు సంపాదించాడు.

ఇది చూసి పాపయ్యకు కన్నయ్య మీదా, అతని కుక్క మీదా అమితమైన అసూయా, పట్టరాని ద్వేషం కలిగింది. ఎలాగైనా ఆ కుక్కను చంపెయ్యాలని అతను నిశ్చయించుకున్నాడు.

సాయంత్రం వేళ కన్నయ్య ఎటో వెళ్ళిన సమయం చూసి, పాపయ్య గబగబా అన్నంలో విషం కలిపి కుక్కకు పెట్టి, చప్పున తన ఇంట్లో దూరి తన పనులు ఏవో చూసుకోసాగాడు.

కుక్క విషపుటన్నం ఇముడ్చుకోలేక, తూలుతూ పాపయ్య ఇంటి వెనక్కు వెళ్ళి, అక్కడ తిన్నదంతా వాంతి చేసేసుకుని, పెద్దగా మూలుగుతూ కన్నయ్య ఇంటికి వచ్చి పడుకున్నది.

తరవాత కొద్దిసేపటికి పాపయ్య కోళ్ళు అటుగా వచ్చి, కుక్క వాంతి చేసుకున్న అన్నం అంతా తినేశాయి. చీకటి పడుతూ ఉండగా పాపయ్య తన కోళ్ళనన్నిటినీ గూట్లోకి తోలేశాడు.

మర్నాడు తెల్లవారుతూండగా పాపయ్య నిద్రలేచి, కన్నయ్య కుక్క ఆ పాటికి చని పోయి ఉంటుందనుకున్నాడు. కాని అప్పుడే తన కుక్కను వెంట బెట్టుకుని వేటకు బయలుదేరుతూ కన్నయ్య అతనికి కని పించాడు.

కుక్క ఇంకా బతికే ఉన్నందుకు ఆశ్చర్యపోయి పాపయ్య తన కోళ్ళను మేతకు వదలటానికి గూడు దగ్గిరికి వచ్చే సరికి తన కోళ్ళన్నీ చచ్చిపడి ఉండటం పాపయ్యకు కనిపించింది.





# భర్త కోసం

## 2

ఆ గ్రామంలో ఒక జుట్టు పండిపోయిన ఆడది తన ఇంటి ముందు అరుగు మీద ఏకులు వడుకుతూ మల్లికకు కనిపించింది. ఆ ముసలిది కోపంగా, "ఈ బుద్ధవర్మ ఎటువంటి నీచుడు!" అని గొణుక్కుంటున్నది.

"ఎందుకమ్మా ఆ మహాత్ముణ్ణి తిడతావు?" అన్నది మల్లిక.

"నాయనా, లోకమంతా కోడై కూస్తుంటే నువు వినలేదా?" అన్నది ఆ వృద్ధురాలు, మల్లికను చూసి మగవాడే అనుకుని.

ఇంతలో చాటింపు వినబడింది: "బుద్ధవర్మ కోడలి జాడ తెలిపిన వారి దరిద్రం తీరిపోతుంది. ఆమెను దాచిన వాళ్ళ పీక తెగిపోతుంది. ఇది రాజాజ్ఞ!"

బ్రాహ్మణ స్త్రీ ఆనంద బాష్పాలు రాలుస్తూ, "భేష్, మల్లికా! పారిపోయావా? ఆ గూనివాడితో కాపరం చెయ్యకు. నీ భర్త యజ్ఞగుప్తుడే!" అని పైకే అనేసింది.

మల్లికకు ఆ ముసలావిడలో నమ్మకం పుట్టుకొచ్చి, ఆమెకు తన సమాచారమంతా చెప్పేసింది. ముసలావిడ మల్లికను ఆప్యాయంగా కౌగలించుకుని, లోపలికి తీసుకుపోయి, కాపాలిక వేషం విప్పదీసి, చక్కగా నలుగుపెట్టి స్నానం చేయించింది.

మర్నాడు ఉదయం మల్లిక కాపాలికుడి వేషం ధరించి నగరానికి తిరిగి వెళ్ళేసరికి, అక్కడ జనం గుంపులు గుంపులుగా చేరి గొడవగా మాట్లాడుకుంటున్నారు. మల్లిక ఒక మనిషిని విశేషం ఏమిటని అడిగితే ఆ మనిషి, "ఏముందీ? ఇక్కడ బుద్ధవర్మ అనే వర్తకుడికి ఒంటెగాడని ఒక గూని కొడుకున్నాడు. ఒక పనికిమాలిన బ్రాహ్మణ కుర్రాడు ఒకడు రత్నంలాంటి పిల్లను

పెళ్ళాడి తెచ్చి, ఆ గూనివాడికి నైవేద్యం పెట్టాడు. ఆ పిల్ల కాస్తా పారిపోయింది,'' అన్నాడు.

''ఆ పనికిమాలిన బ్రాహ్మణ కుర్రాడు ఉండే ఇల్లు చూపగలవా?'' అని మల్లిక ఆ మనిషిని అడిగింది. ఆ మనిషి ఆమెను యజ్ఞగుప్తుడి ఇంటికి చేర్చాడు.

యజ్ఞగుప్తుడి ఇల్లు చాలా పేదగా ఉన్నది. ఒక పక్క అగ్నిహోత్రం ఉన్నది. దాని సమీపంలో యజ్ఞగుప్తుడు కూర్చుని, కొందరు శిష్యుల చేత అధ్యయనం చేయిస్తున్నాడు.

మల్లిక అక్కడికి వెళ్ళి, చేతికర్ర కింద పెట్టి, బాసిపట్టు వేసుకుని కూర్చుని, ''తమరు బోధిస్తున్న గ్రంథం ఏమిటి?'' అని అడిగింది.

''మనుధర్మ శాస్త్రంలో వర్ణాశ్రమ ధర్మాలు వివరిస్తున్నాను,'' అన్నాడు యజ్ఞ గుప్తుడు.

''అబద్ధం! వర్ణాంతర వివాహం చేసుకుని, కట్టుకున్న భార్యను ఒక ఒంటి కంటి గూని వాడికి అర్పించిన నువ్వు ధర్మశాస్త్రాలు ఏమని బోధిస్తున్నావు? అలాంటి పనిని ఎలా సమర్థిస్తావు?'' అన్నది మల్లిక.

''తండ్రి ఆజ్ఞను పాలించటం కొడుకు ధర్మం. రాముడు ఏం చేశాడు?'' అన్నాడు యజ్ఞగుప్తుడు.

''నువ్వు అవతార పురుషుడితో వంతు వస్తున్నావా? సరే, తండ్రి ఆజ్ఞ ప్రకారం పెళ్ళాడావు. ఆమెను ఏమని వదిలేశావు?'' అన్నది మల్లిక.



యజ్ఞగుప్తుడు ఆ ప్రశ్నకు సమాధానం చెప్పలేకపోయాడు.

మల్లిక మధ్యాన్నం దాకా అక్కడే కూర్చుని, భిక్ష మెత్తుకునే మిష మీద వెళ్ళిపోయి బ్రాహ్మణస్త్రీ ఇంటికి చేరుకున్నది. అది మొదలు ఆమె కొన్ని రోజులపాటు యజ్ఞగుప్తుడి ఇంట పగలూ, బ్రాహ్మణస్త్రీ ఇంట రాత్రీ గడుపుతూ వచ్చింది.

యజ్ఞగుప్తుడు పాప కార్యానికి ఒడిగట్టినది దారిద్ర్యం వల్లనే అని గ్రహించి మల్లిక అతన్ని ధనాశతో ఆకర్షించ నిశ్చయించింది. ఆమె బ్రాహ్మణస్త్రీ ద్వారా తన ముత్యాల హారం అమ్మించి, అమ్మగా వచ్చిన బంగారమూ, వెండీ రాగి పాత్రలలో నింపి, వాటిని గ్రామం బయట గుర్తుగా ఒక చోట పాతింది. తరవాత ఆమె యజ్ఞగుప్తుడితో, "నా వంటి వాళ్ళు ఒకే చోట చాలా కాలం ఉండరాదు. నీ మీది వాత్సల్యం కొద్దీ, అయిదు రోజుల గడువు దాటి ఉండిపోయాను. ఇక కాశీయాత్రకు బయలుదేరాలి. మరొక సంగతి ఏమంటే, నా దగ్గిర మహాకాళమంత్ర గ్రంథం ఉన్నది. దాని సహాయంతో భూమిలో ఉండే నిధి నిక్షేపాలు తెలుస్తాయి. ఇటీవల ఒక చోట చిన్న నిక్షేపం ఉన్నట్టు గమనించాను. కావాలంటే నా వెంట వచ్చి దాన్ని తీసుకో," అన్నది.

యజ్ఞగుప్తుడు నమ్మకస్థులైన ఒకరిద్దరు శిష్యులతో సహా ఆమె వెంట వెళ్ళి, రాగి పాత్రలను ఇంటికి తెచ్చుకున్నాడు. అతను సంతోషంగా ఈ వార్త తండ్రికి తెలిపి,





ఇద్దరూ కలిసి కాశీకి వెళ్ళారు. అక్కడ కొంతకాలం ఉండి, నైమిశారణ్యం మీదిగా గంగా ద్వారానికి వెళ్ళారు. అక్కడి నుంచి కురు, పుష్కర, మహాలయ పుణ్యక్షేత్రాలు చూసి, ఉజ్జయినికి బయలుదేరారు.

మల్లిక అతనితో, "నువు ఉజ్జయినికి రావటం మంచిది కాదు. అక్కడ నువు మహా ద్రోహం చేశావు. ఉజ్జయినీవాసులు నిన్ను క్షమించరు. అందుచేత ఇక్కడి నుంచి నువు ఇంటికి వెళ్ళిపో," అన్నది.

"స్వామీ, తమరు వెళ్ళిన చోటి కల్లా వస్తాను. శిష్యుడు గురువును విడనాడ రాదు," అన్నాడు యజ్ఞగుప్తుడు.

ఇద్దరూ ఉజ్జయిని చేరినాక మల్లిక అతన్ని భద్రవటం అనే చోట ఉండమని, "నేను ఏదన్నా నిధి నిక్షేపం కనిపెట్టిన దాకా తిరిగి రాను. నేను రావటం ఆలస్యమైతే నువ్వేమీ కంగారు పడకు," అన్నది.

ఆమె సిప్రానదీ తీరానికి వెళ్ళి, చక్కగా స్నానం చేసి, కాపాలిని దుస్తులు ధరించి, తన తండ్రి ఇంటికి వెళ్ళి భిక్షం అడిగింది. భిక్షం వెయ్యటానికి వచ్చిన పరిచారిక మల్లికను గుర్తించి, గుండెలు బాదుకుంటూ యజమానురాలి వద్దకు వెళ్ళి, "అమ్మా, కొంప మునిగింది! సర్వనాశనమయింది! నీ కూతురు కాపాలిని అయి వాకిట నిలబడి ఉన్నది. వెళ్ళి చూసుకో!" అన్నది.

కాపాలికుడి వద్ద మహాకాళమంత్ర గ్రంథం ఉన్నదని కూడా చెప్పాడు.

"ఎందుకొచ్చిన వేదంరా? వదిలెయ్యి! ఆ కాపాలికుణ్ణి ఆశ్రయించి ఆ మహాకాళ మంత్రం నేర్చుకో. ఆ పుస్తకం నీకు దొరికే దాకా ఆ కాపాలికుడి అడుగులకు మడుగు లొత్తు!" అన్నాడు యజ్ఞగుప్తుడి తండ్రి.

తండ్రి ఇలా అనగానే యజ్ఞగుప్తుడు, ప్రయాణానికి సిద్ధమవుతున్న మల్లికతో, "స్వామీ, నేనూ తమ వెంట తీర్థయాత్రలు చేస్తాను. నా వంటి పాపాత్ముడికి అంతకన్న మంచిమార్గం ఏమున్నది?" అన్నాడు.

ఆమె అతన్ని వారించటానికి ప్రయత్ని స్తున్నట్టు కొంతసేపు నటించి, ఒప్పుకున్నది.

మల్లిక తల్లి వచ్చి, మాటా పలుకూ లేకుండా, మల్లికె ధరించిన కాపాలినీ వేషం లాగేసి, స్నానం చేయించి, "ఏమిటే ఇదంతా?" అని అడిగింది.

"నిజంగా కాపాలినిని అయాననుకున్నావా, అమ్మా? నాన్నను పిలు, నా కథ అంతా చెబుతాను," అన్నది మల్లిక.

సాగరదత్తుడు వచ్చాడు. మల్లిక అయనతో, "నీ అల్లుడు భద్రవటంలో ఉన్నాడు. తీసుకురావటానికి అన్నలను పంపు," అన్నది.

యజ్ఞగుప్తుణ్ణి అతని బావమరుదులు పట్టుకుని, "దుర్మార్గుడా, దొరికావా, రాజుగారు రమ్మంటున్నారు, పద!" అన్నారు.

తనకు కారాగృహమూ, మరణదండనా తప్పవనుకుని యజ్ఞగుప్తుడు, "నా మిత్రుడు కాపాలికుడు వచ్చేదాకా ఆగండి," అని తన బావమరుదులను బతిమాలుకున్నాడు.

మల్లిక అన్నలు నవ్వి, "ఇంకెక్కడ మిత్రుడు? అతను చేరవలసిన చోటికి ముందే చేరాడు. నిన్ను పట్టియిచ్చినది కూడా అతనే. నీ వంటి దుర్మార్గులతో మైత్రి ఎవరికి మాత్రం ఎలా నిలుస్తుంది?" అని, మహా ఉత్సాహంతో అతన్ని ఏడిపిస్తూ తమ ఇంటికి తీసుకుపోయారు.

తన అల్లుణ్ణి చూడగానే సాగరదత్తుడు వచ్చి అప్యాయంగా కౌగలించుకున్నాడు. అతని అత్తవారి తరఫు బంధువులంతా అతన్ని చుట్టుముట్టారు.

భర్తకోసం మల్లిక పడ్డ శ్రమ చూసి యజ్ఞగుప్తుడు, "ఆడదాని బుద్ధి రెండు అంగుష్ఠాలు అంటారు. కాని శుద్ధ పొరపాటు. బుద్ధిమాలిన పాండవులు విరాటుడి వద్ద, అజ్ఞాతంగా ఉన్నారంటే అదంతా ఆ ద్రౌపది తెలివే అయి ఉండాలి," అనుకున్నాడు.

మల్లిక కథ అంతా ఆ దేశపు రాజుకు తెలిసింది. ఆయన మల్లికనూ, యజ్ఞగుప్తుణ్ణీ పిలిపించి, అతనికి ధనమూ, అగ్రహారాలూ ఇచ్చి, "అమ్మాయీ, నీ భర్త తన బ్రాహణ విధులు సరిగా నిర్వర్తించేటట్టు నువే చూసుకోవాలి!" అన్నాడు.

యజ్ఞగుప్తుడు తన భార్యను ప్రేమగా చూసుకుంటూ సుఖంగా జీవించాడు.



# ఉపాయం

ఒక గ్రామంలో ఒక అసామి ఉండేవాడు. అతను ఏమీ చదువుకోకపోయినా మంచి తెలివి తేటలు గలవాడు. ఒకసారి అతనికి పది రూపాయలు అవసరమయింది. దాన్ని సంపాదించటానికి అతను ఒక ఉపాయం ఆలోచించాడు.

పట్నంలో అతనికి తెలిసిన ప్లీడరు ఒకాయన ఉన్నాడు. అసామి ఆయన వద్దకు వెళ్ళి, "ప్లీడరుగారూ, మీరు చదువుకున్నవారు, తెలివి గలవారు. నేను చదువుకోని పల్లెటూరి మొద్దును. నేను తమర్ని ఒక ప్రశ్న అడుగుతాను. సమాధానం చెప్పలేకపోతే ఇరవై రూపాయలు ఇవ్వాలి. మీరు నన్ను ఒక ప్రశ్న అడగండి, సమాధానం చెప్పలేకపోతే పది రూపాయలు ఇచ్చుకుంటాను. పేదవాణ్ణి గద!" అన్నాడు.

అందుకు ప్లీడరుగారు ధైర్యంగా ఒప్పుకున్నాడు.

"మూడు కాళ్ళూ, రెండు ముక్కులూ గల పక్షి ఏది?" అని అసామి అడిగాడు.

ప్లీడరు సమాధానం చెప్పలేక ఓడినట్టు ఒప్పుకుని అసామికి ఇరవైరూపాయలూ ఇచ్చి, "నేను నిన్ను అ ప్రశ్నే అడుగుతున్నాను. సమాధానం చెప్పు," అన్నాడు.

"ఓడిపోయాను!" అంటూ అసామి పది రూపాయలు ప్లీడరుగారి కిచ్చి, మిగిలిన పది జేబులో వేసుకుని వెళ్ళిపోయాడు.

—ఎమ్. శేషయ్య.





# వెర్రిబాగులవాడు

ఒక గ్రామంలో శాంతమ్మ అనే విధవరాలికి రాముడు అనే కొడుకు ఉండేవాడు. వాడు కొంచెం వెర్రిబాగులవాడు.

ఒకనాడు తల్లి రాముడితో, "నాయనా, నువు కూడా ఎక్కడన్నా పని సంపాదించి నాలుగు డబ్బులు తీసుకురా," అన్నది.

"సరేనమ్మా, బస్తీకిపోయి, ఏదన్నా పని చూసుకుని సాయంకాలానికి తిరిగి వస్తాను. రొట్టెలు చేసి ఇయ్యి," అన్నాడు రాముడు.

తల్లి అలాగే వాడికోసం కొన్ని రొట్టెలు చేసి ఇచ్చింది. రాముడు వాటిని తీసుకుని బయలుదేరాడు. ఎంతోదూరం పోకముందే రాముడికి అలుపు వచ్చి, ఆకలి కూడా వేసింది. అందుచేత వాడు ఒక చిన్న చెరువు సమీపంలో చెట్టు నీడన కూర్చుని, తల్లి ఇచ్చిన రొట్టెలు తిని, చెరువులో నీళ్ళు తాగాడు. వాడికి తిండి తినగానే నిద్ర ముంచుకొచ్చింది.

వాడు తిరిగి మేలుకునే సరికి సాయంకాలం కానే అయింది. అందుచేత వాడు ఇంటికి పోవటానికి సిద్ధపడ్డాడు. ఇంతలో వాడికి ఒక చెట్టుమీద తొండ కనిపించింది. అది తన తలను పైకీ, కిందికీ ఆడించటం చూసి రాముడు, అది తనను, "ఏం కావాలి?" అని అడుగుతున్న దనుకున్నాడు.

"నాకు పనికావాలి," అన్నాడు వాడు. తొండ మళ్ళీ తల పైకీ, కిందికీ ఆడించింది.

"నువే పని ఇస్తావా? అయితే రేపటి నుంచీ పనిలో చేరతాను. ఇవాళకు పొద్దు పోయింది," అని తొండతో చెప్పి, రాముడు ఇంటికి వెళ్ళి, పనిదొరికిందని తల్లితో అన్నాడు.

అదిమొదలు రాముడు రోజూ భోజనం మూట గట్టుకుని ఉదయం ఇంటి నుంచి బయలుదేరి చెరువు వద్దకు వెళ్ళేవాడు; అక్కడ రొట్టెలు తిని, నీళ్ళు తాగి నిద్ర పోయేవాడు. తొండ ఏదన్నా పని చెబితే

ఎం. వీరారెడ్డి

చేద్దామనే వాడి ఉద్దేశం. కాని ఆ తొండ వాడికి ఏ పనీ చెప్పేది కాదు.

ఇలా నెలరోజులు గడిచాయి.

"ఏంరా, నీ యజమాని నీకు నెలజీతం ఇవ్వలేదా ?" అని తల్లి రాముణ్ణి అడిగింది.

"ఇవాళ జీతం అడిగి తీసుకుంటా నమ్మా," అన్నాడు రాముడు.

ఆ రోజు వాడు చెరువుగట్టు చేరి, తిండి తిని, నిద్రవస్తున్నా ఆపుకుని తొండ కోసం చూశాడు. చాలాసేపటికి అది కనబడింది. అది చెట్టు దిగువన ఉన్న కన్నంలోనుంచి బయటికి వచ్చేటప్పుడు, రాముడు దానితో, "నెల రోజులుగా నీ కింద పనిలో ఉన్నాను. అందుచేత నాకు జీతం ఇయ్యి," అన్నాడు.

తొండ తల పైకి కిందికీ ఆడించింది.

"రేపు ఇస్తావా ? సరే!" అని రాముడు తానే దాని భాషకు అర్థం చెప్పుకుని, ఇంటికి తిరిగి వెళ్ళి తల్లితో, "జీతం రేపిస్తారుట!" అన్నాడు. తల్లి నిజమే కాబోలు ననుకున్నది.

మర్నాడు రాముడు తొండను చూస్తూనే, "జీతం తెచ్చావా ?" అని అడిగాడు. తొండ కిందటి రోజులాగే తల పైకీ. కిందికీ ఆడించింది.

అది చూసి మండిపడి, రాముడు దాని మీద ఒక రాయి విసిరాడు. తొండ బెదిరి చెట్టు దిగువన ఉన్న కన్నంలో దూరింది.

రాముడు ఇంటికి వెళ్ళి గునపం తెచ్చి ఆ కన్నాన్ని తవ్వి పెద్దది చేశాడు. కాని తొండ జాడలేదు. అది ఎప్పుడో బయటికి వెళ్ళిపోయింది. అది ఇంకా లోతుకుపోయి ఉంటుందనుకుని రాముడు నేల తవ్వుతూ పోయాడు. ఇలా తవ్వుతూ పోగా వాడికి లంకెబిందెలు దొరికాయి.

ఆ ధనం జేబులో పట్టినంత తీసుకుపోయి రాముడు తల్లికి చూపాడు. అంత ఎక్కడిదని ఆమె అడిగితే జరిగినదంతా ఆమెకు రాముడు చెప్పేశాడు. చీకటి పడనిచ్చి రాముణ్ణి వెంటబెట్టుకుని శాంతమ్మ చెరువు దగ్గిరికి వచ్చి, లంకెబిందెలను ఇంటికి తీసుకుపోయింది. అటు తరవాత వెర్రిబాగుల రాముడికి పనిచేసే అవసరమే లేకపోయింది.





# ధర్మదాత

పూర్వం బాగ్దాదునగరంలో ఒక లక్షాధికారి ఉండేవాడు. అతడు దానధర్మాలు చేసి, గొప్ప ధర్మదాత అనే కీర్తి సంపాదించుకున్నాడు. ఆ నగరంలోనే మరొక లక్షాధికారి ఉండేవాడు. అతను పరమ లోభి; జన్మలో ఎవరికీ చిల్లిగవ్వ దానం చేసిన పాపాన పోయిన వాడు కాడు. అందువల్ల దాతను మెచ్చుకునే ప్రజలు, ఆ నోటితోనే లోభిని తిట్టేవారు.

తనకు గల ఈ అపఖ్యాతిని ఎలాగైనా పోగొట్టుకోవాలనిపించింది లోభికి. తన వద్ద విశ్వాసపాత్రుడుగా పనిచేస్తున్న అబ్దుల్ రజాక్‌ను ఏదైనా ఉపాయం చెప్పమన్నాడు.

"మీరు గొప్ప ధర్మదాత అని ప్రజల చేత అనిపించుకోవటం అంత సులభం కాదు. పైగా ఖర్చుతో కూడిన పని. అంతకంటే, ఆ ధర్మదాత అని పేరు తెచ్చుకున్న పెద్దమనిషిని మోసగించి, ఆయన ద్వారా మీ కీర్తి వ్యాపింపజేయుటం సులభం. ఆయనను ఒక రోజు మన ఇంటికి అతిథిగా పిలవండి. నేను రకరకాల వేషాలు వేసుకుని బిచ్చగాడిలాగా వస్తాను. మీరు ప్రతిసారీ నాకు నూరేసి దీనారాలు దానం ఇవ్వండి. ఆ దెబ్బతో ఆయన కనిపించిన వారందరి దగ్గిరా మీ దానగుణం గురించి చెబుతాడు. మీకు బోలెడంత కీర్తి వస్తుంది," అన్నాడు అబ్దుల్ రజాక్.

"నీ ఆలోచన భేషుగ్గా ఉంది. నువు ఆయన ఇంటికి వెళ్ళి, రేపే మన ఇంటికి ఆహ్వానించు," అన్నాడు లోభి.

అబ్దుల్ రజాక్ ధర్మదాత ఇంటికి వెళ్ళి, తన యజమాని పేరు చెప్పి, "హుజూర్, రేపు ఉదయమే తమరు మా యజమాని ఇంటికి వచ్చి విందు భోజనం చెయ్యాలి. మా యజమాని తమరిని ఆహ్వానించమని పంపారు నన్ను." అని వినయంగా అన్నాడు.

రాజారెడ్డి



"మీ యజమాని పిల్లికి బిచ్చంపెట్టడని ప్రతీతిగదా, నన్ను విందుకు ఆహ్వానించటం విచిత్రంగా ఉంది!" అన్నాడు దాత.

"హుజూర్, మా యజమాని గురించి అందరూ అనే మాటలు నమ్మకండి. నిజం ఏమిటంటే, ఆయన గొప్ప దాత. అయితే ఆయన చేసేవి గుప్త దానాలు. మూడో కంటికి తెలియవు. రేపు మీరే చూస్తారుగా!" అన్నాడు అబ్దుల్ రజాక్.

"సరే, రేపు పెందలాడే వస్తున్నానని మీ యజమానితో చెప్పు," అని దాత అబ్దుల్ రజాక్‌ను పంపేసి, తన నమ్మకస్తుడైన నౌకరును అజీజ్‌ను పిలిచి, వాడితో కాస్సేపు మాట్లాడాడు.

మర్నాడు తెల్లవారగానే ఆయన బయలు దేరి లోభి ఇంటికి వచ్చాడు. లోభి ఆయనకు ఆదరపూర్వకంగా స్వాగతం తెలిపి, అతిథి మర్యాదలు చేసి కూర్చోబెట్టి, "చూశారా, నా దానధర్మాలను గురించి లోకానికి తెలియటం నా కేమాత్రమూ ఇష్టం లేదు. నాకు దానం చెయ్యటం ప్రధానం గాని, కీర్తి ప్రధానం కాదు," అన్నాడు.

వాళ్ళు మాట్లాడుకుంటూ ఉన్న సమయంలో అక్కడినుంచి మెల్లిగా జారుకున్న అబ్దుల్ రజాక్ ఒక గుడ్డి బిచ్చగాడి వేషం వేసుకుని, తన యజమాని ఇంటికి వచ్చి బిచ్చం అడిగాడు. లోభి తన పక్కనే పెట్టుకుని ఉన్న సంచీ నుంచి నూరు దీనారాలు తీసి వాడికి ఇచ్చేశాడు.

గుడ్డివాడు వెళ్ళిపోయిన కాస్సేపటికి ఒక ముసలివాడు వచ్చాడు. లోభి వాడికి కూడా సంచీలో నుంచి నూరు దీనారాలు ఎంచి ఇచ్చాడు.

మధ్యాహ్నం అయేలోపల ఒక ఫకీరూ, ఒక మూగవాడూ, ఒక సాధువూ, ఒక కుంటివాడూ, ఒక అవిటివాడూ ఇలా పది మంది వచ్చారు. లోభి ప్రతి ఒక్కడికీ నూరేసి దీనారాలు దానం చెయ్యటమే గాక, తన నౌకరు ఇంత చాకచక్యంగా ఇన్ని రకాల వేషాలు మార్చుకు రావటం చూసి వాణ్ణి తన మనసులో మెచ్చుకున్నాడు.

ఇదంతా చూస్తున్న దాత లోభితో, "మీ వంటి దాతను నేను ఎక్కడా చూడలేదు. నేను చూస్తూండగానే మీరు వెయ్యి దీనారాలు దానం చేసేశారు. ఎంత ఆశ్చర్యం!" అన్నాడు.

"తమరు ఆశ్చర్యపడుతున్నారుగాని, ఇది నాకు మామూలే!" అన్నాడు లోభి.

మధ్యాన్నానికల్లా అబ్దుల్‌రజాక్ తన మామూలు వేషంతో తిరిగి వచ్చి ఇంటి లోపలికి వెళ్ళాడు. వాడి వెనకనే లోభి కూడా లోపలికి వెళ్ళి, "వేషాలు బ్రహ్మాండంగా వేశావురా! ఏదీ సొమ్ము?" అని అడిగాడు.

"ఇదిగోనండి, మూడు వందల దీనారాలు," అంటూ అబ్దుల్‌రజాక్ తన యజమానికి సొమ్ము అందించాడు.

"మూడువందలేమిటి? నేను వెయ్యి దీనారాలు దాకా ఇచ్చాను గదరా!" అన్నాడు లోభి కంగారుగా.

"వెయ్యి దీనారాలేమిటండీ? నేను మూడు సార్లేగా వచ్చాను? మీరు నాకు మూడు సార్లూ మూడు వందలిచ్చారు!" అన్నాడు అబ్దుల్‌రజాక్.

"నువు వచ్చింది మూడుసార్లే అయితే మిగిలిన ఏడు సార్లూ వచ్చినది ఎవరైనట్టూ?" అని లోభి ఆగ్రహంతో అరిచాడు.

"ఏడుసార్లూ వచ్చినవాడు మా నౌకరు అజీజ్ అయి ఉంటాడు లెండి," అని దాత గొంతు వెనకనుంచి వినిపించింది.

ఇద్దరూ వెనక్కు తిరిగి చూసేసరికి దాత ద్వారం వద్ద నిలబడి ఉన్నాడు. ఆయన లోభి వెనకగానే వచ్చి వాళ్ళ సంభాషణ అంతా విన్నాడు. లోభి ముఖం కమిలి, పెంకులాగా అయింది.

"అజీజ్ కాస్సేపట్లో వస్తాడు. వాడు కూడా మంచి నమ్మకస్తుడే. సొమ్ము ఎక్కడికీ పోదు లెండి," అని దాత లోభికి ధైర్యం చెప్పాడు.

ఇంతలోనే అజీజ్ వచ్చి, ఏడు వందల దీనారాలూ లోభికి ఇచ్చేశాడు. ఆశ్చర్యంతోనూ, అవమానంతోనూ కొయ్యబారిపోయిన లోభి నోటంట మాటరాలేదు.



# తాగుబోతు మాటలు!

ఒక ఊళ్ళో కట్టెలుకొట్టేవాడు ఒకడు ఉండేవాడు. వాడు పచ్చి తాగుబోతు. ఒకనాడు వాడు అడవిలో కట్టెలు కొట్టుతూ ఉండగా మిట్టమధ్యాహ్నం వేళ వాడికి తగని దాహం వేసింది. చాలాసేపు అడవి అంతా గాలించిన మీదట ఒక చోట రాళ్ళగుట్టల మధ్య కోనేరు కనిపించింది.

వాడు దాహం తీర్చుకుని, "ఈ కోనేరంతా సారాయి అయిపోయి, ఈ రాళ్ళగుట్టలన్నీ మాంసం గుట్టలైపోతే తృప్తిగా తిని, తాగి, తల పగలగొట్టుకుని చచ్చిపోతాను గద!" అనుకున్నాడు.

వనదేవత వాడి మాటలు విని, వాడి నిజాయితీ పరీక్షింప గోరి కోనేరంతా సారాయిగానూ, రాళ్ళగుట్టలు మాంసం గుట్టలుగానూ మార్చేసింది. కట్టెలుకొట్టేవాడు పొట్ట పట్టినంత తిని, సారా తాగి, అక్కడే పడుకుని నిద్రపోయాడు.

పొద్దు కూకుతున్నదనగా వాడు నిద్ర లేచి ఇంటికి బయలుదేరుతుంటే, వనదేవత ప్రత్యక్షమై, "నీ కోరిక తీరింది గదా, తల పగలగొట్టుకుని చచ్చావు కావేం?" అని అడిగింది.

"బలేదానివమ్మా! నమ్మక నమ్మక తాగుబోతు మాటే నమ్మావా?" అంటూ వాడు ఇంటి దారి పట్టాడు.

—కె. కె. రావు.






# కుశలప్రశ్నలు

ఒక గ్రామంలో ఒక ధనికుడికి శంకరం అని ఒకడే కొడుకు ఉండేవాడు. అతను దూర గ్రామంలో ఉండే ఒక పేద యింటి పిల్లను ప్రేమించి, పెళ్ళి చేసుకుని కాపరానికి తెచ్చాడు. తమ అనుమతి లేకుండా తమ యింటి కోడలైన విశాలాక్షి పట్ల అత్తమామలు ముభావంగా ఉంటూ వచ్చారు.

అత్తమామలు తనను గురించి "దరిద్రపు పిల్ల!" అంటూ ఉండటం విశాలాక్షి అప్పుడప్పుడూ విన్నది. ఆమెకు పుట్టింటి క్షేమ సమాచారాలు శంకరం ద్వారానే తెలుస్తూ ఉండేవి. తన తండ్రికి తనను చూడాలని ఉన్నట్టు ఆమెతో శంకరం ఒకసారి చెప్పాడు.

"ఆయనకు మంచి బట్టలు పంపి, అవి కట్టుకుని మన ఇంటికి రమ్మని కబురు చెయ్యండి," అన్నది శంకరంతో విశాలాక్షి.

విశాలాక్షి తండ్రి అల్లుడు పంపిన మంచి బట్టలు కట్టుకుని కొంత కాలానికి వచ్చాడు. శంకరం తండ్రి ఆయనను చూసి, ఫలానా అని తెలుసుకుని, ఏ విధమైన మర్యాదలు చెయ్యకుండా లోపలికి వెళ్ళి, "మీ నాన్న వచ్చాడు. వసారాలో ఉన్నాడు." అని తన కోడలితో అన్నాడు.

విశాలాక్షి వసారాలోకి వచ్చి తండ్రిని మామూలు కుశలప్రశ్నలు వేసింది. తమ సంభాషణ అంతా అత్తమామలు శ్రద్ధగా వింటున్నారని ఆమెకు తెలుసు. అందుచేత ఆమె యుక్తిగా తన తండ్రిని, "నాన్నా, మన ఇనప్పెట్టె తియ్యకుండా గలగలమంటున్నదా?" అని అడిగింది.

విశాలాక్షి పుట్టిల్లు ఇరుకైనది. గోడలు మాసి నల్లగా ఉండేవి. వాటికి కిటికీలైనా ఉండేవి కావు. పైన కప్పిన తాటాకులు గాలికి కదిలి గలగలలాడేవి.

"దానికేం, తల్లీ. అది ఎప్పటిలాగే ఉంది!" అన్నాడు తండ్రి.

సి. రామశర్మ

"పొలాల్లో అపరాలు బాగా రాల్తున్నాయా? మన వాళ్ళు వాటిని చక్కగా ఇంటికి తెస్తున్నారా?" అని కూతురు అడిగింది. పాపం, విశాలాక్షి పుట్టింటి వాళ్ళు పరిగ ఏరుకుని జీవించేవాళ్ళు.

"దానికేమమ్మా? అంతా యథావిధిగా జరుగుతున్నది," అన్నాడు తండ్రి.

"మూల ఉండే దంతాలు అలాగే ఉన్నాయా? కొత్తవి ఏవీ చేర్చలేదా?" అని కూతురు మళ్ళీ అడిగింది. ఆమె దంతాలన్నవి వెదురు కర్రలు.

"కొత్తవి చేర్చటానికి చూస్తున్నాను," అన్నాడు తండ్రి.

"ఆకాశదీపం అలాగే ఉన్నదా?" అన్నది కూతురు. వాళ్ల ఇంటి కప్పులో కంత ఉండేది. దాన్ని వాళ్ళు ఆకాశదీపం అనేవాళ్ళు.

"ఉన్నదమ్మా! ఆకాశదీపాన్ని ఇంకా తీసెయ్యలేదు," అన్నాడు తండ్రి.

"అమ్మ చేతికీ, అబ్బాయిల చేతులకూ, అమ్మాయిల చేతులకూ ఉండే కెంపులు ఎలా ఉన్నాయి?" అని కూతురు అడిగింది.

"అవీ అలాగే ఉన్నాయి," అన్నాడు తండ్రి. విశాలాక్షి కెంపులన్నవి పని చేస్తే తగిలేగాయాలు.

తండ్రి సమాధానాలు విని, తన పుట్టింటి పరిస్థితి ఏమీ మారనందుకు విశాలాక్షి ఎంతో నీరసపడిపోయింది. ఆమె అత్తమామలకు మటుకు తమ వియ్యంకుడు మంచి ధనికుడన్న అభిప్రాయం కలిగింది.

అత్తగారు చప్పున బయటికి వచ్చి, "మీ నాన్న వచ్చి ఎంతసేపయింది? అలా కబుర్లు చెబుతూ కూర్చుంటావేమే? కాళ్ళు కడుక్కునేటందుకు నీళ్ళిచ్చి, ఫలహారమూ అవీ పట్టుకురా! వెళ్లూ!" అని కోడలిని తొందర చేసింది.

విశాలాక్షి ఎత్తు పారింది. ఆమె అత్తమామలు ఆమె తండ్రిని ఘనంగా చూడటమే గాక, వెళ్ళేటప్పుడు ఆయనతోపాటు, ఆయన కుటుంబం వారందరికీ మంచి మంచి బట్టలూ అవీ ఇచ్చారు. శంకరం చాటుగా ఆయనకు డబ్బు కూడా ఇచ్చి పంపేశాడు.





# నిద్రపట్టని రాజు

పూర్వం ఒక రాజుకు అష్టఐశ్వర్యాలూ ఉండేవి. ఆయన నివసించే భవనం చుట్టూ పూలతోట ఉండేది. అందులో ఏడాది పొడుగునా చక్కని పూలు పూసేవి. ఆ తోటకు అవతల అడవి ఉండేది. అందులో ఆయన తప్ప మరెవరూ వేటాడరాదు.

ఏ సుఖాలకూ లోటులేని ఆ రాజుకు ఒక్క సుఖం లోపించింది. అదేమిటంటే నిద్ర సుఖం. ఆయనకు నిద్ర వచ్చేది కాదు. నిద్ర సుఖం లేని వాడికి మరే సుఖమూ లేదని రాజు గ్రహించాడు. నిద్ర రాకపోవటమన్నది ఒక పెద్ద జాడ్యమని ఆయనకు తోచింది. ఆ జాడ్యానికి ఆయన ఎన్ని చికిత్సలో చేయించుకున్నాడు. కాని ఒక్క చికిత్సా పని చెయ్యలేదు. దూర దేశాల నుండి ఘనవైద్యులు వచ్చి మందు లిచ్చారు. అందువల్ల కూడా ప్రయోజనం లేకపోయింది.

రాజు ఒక రాత్రి అంతా పక్క మీద ఇటూ అటూ పొర్లి జీవితంతో విసిగి పోయాడు. ఆయన తెల్లవారగానే లేచి, సామాన్యుడి దుస్తులు ధరించి, ఎవరికీ చెప్పకుండా అడవిలోకి వెళ్ళిపోయాడు.

కొంత దూరం వెళ్ళేసరికి రాజుకు ఏదో చప్పుడు వినిపించింది. ఆయన చిరాకు పడుతూ, కాలి బాటల వెంబడి, ఆ ధ్వని వచ్చిన దిక్కుగా వెళ్ళాడు. ఒక చోట ఒక మనిషి గొడ్డలితో ఒక చెట్టును కొట్టు తున్నాడు. రాజుకు ముందు వినిపించిన చప్పుడు అదే.

చెట్టు కొట్టే మనిషి శరీరమంతా చెమట దిగకారుతున్నది. అతను చేసే పని చూస్తుంటే రాజుకు ఆశ్చర్యం కలిగింది.

"పాపం, ఎంత కష్టపడి పని చేస్తు న్నాడు! ఎండ జాస్తి అవుతున్నది కూడానూ!" అనుకున్నాడు రాజు.

ఆర్. విఠల్‌దాసు




కొంతసేపు అయాక చెట్టు కొట్టేవాడు గొడ్డలి దించి నేల మీద పెట్టి, మురికి బట్టతో ఒంటి చెమట తుడుచుకుని, నేల మీద వెల్లికిలా పడుకుని, "అమ్మయ్య!" అనుకున్నాడు. తరవాత ఆ మనిషి పక్కకు పొర్లుతూ రాజును చూశాడు. ఎవరో తన కేసి తేరిపార చూస్తూండటం కళ్ళబడగానే ఆ మనిషి చప్పున లేచి కూర్చున్నాడు.

రాజు ఆ మనిషిని జాలితో చూసి, చిరునవ్వు నవ్వుతూ, "నువు చాలా అలిసిపోయి ఉండాలి. ఎండ తీవ్రంగా ఉన్నది, కొంచెం విశ్రాంతి తీసుకోరాదూ?" అన్నాడు.

"అయ్యా, మొదట మిమ్మల్ని చూసి తనిఖీదారు అనుకుని భయపడ్డాను. మీ మాటలు వింటే, మీకు శరీర శ్రమ అలవాటు లేనట్టున్నది." అన్నాడు చెట్టు కొట్టేవాడు.

"నిజమే!" అన్నాడు రాజు.

"మీ బట్టలు శుభ్రంగా ఉన్నాయి. అరిచేతులు మెత్తగా కనిపిస్తున్నాయి. నా అరిచేతులు చూడండి, ఎలా కాయలు కాశాయో! మీరు దర్జీ పని చేస్తారేమో?" అని ఆ మనిషి అడిగాడు.

"నేను దర్జీని కాను. కాని, ఒక మాట చెప్పు. ఇంత కష్టపడి పని చేసినాక నీకు నిద్ర ఎలా పట్టుతుంది?" అన్నాడు రాజు.

ఇది పిచ్చి ప్రశ్నగా తోచి చెట్టు కొట్టేవాడు గట్టిగా నవ్వి, "నేను గంటల కొద్దీ నిద్ర పోగలను. నల్లులు కుట్టినా తెలీదు," అన్నాడు.

"నేను నమ్మలేను," అన్నాడు రాజు.

"మీరు ఏమిటి నమ్మలేరు? నాకే డబ్బుంటే వారం రోజుల పాటు నిద్ర పోదును. కాని పేదవాణ్ణి; పని చేస్తే గాని పొట్ట గడవదు. నేను కష్టపడకపోతే నా భార్యా బిడ్డలూ ఆకలితో మాడిపోతారు." అన్నాడు ఆ మనిషి.

"మన రాజుకు నిద్ర పట్టదని నువు వినలేదూ?" అని రాజు అడిగాడు.

"అదే నాకు వింతగా ఉన్నది. ఆయన నా లాగా కష్టపడి పని చెయ్యనక్కర్లేదు.



పడుకోవటానికి మెత్తని పట్టు పరుపులున్నాయి. ఎందుకు నిద్రపోలేడో?" అన్నాడు ఆ మనిషి.

రాజు మాట్లాడ లేదు. చెట్టు కొట్టేవాడు లేస్తూ, "నేను కూర్చుని కబుర్లు చెప్పటానికి లేదు. తనిఖీదారు చూశాడంటే పనిలో నుంచి తీసేస్తాడు," అని గొడ్డలి తీసుకుని, మళ్ళీ చెట్టు కొట్టసాగాడు.

ఆ మనిషి పని చేస్తూంటే రాజు వింతగా చూసి, "రాజునై ఉండి నేను నిద్రపోలేకుండా ఉన్నానే, ఈ కట్టెలు కొట్టేవాడు ఎలా నిద్రపోగలుగుతున్నాడో!" అని ఆశ్చర్యపోయాడు.

కొంచెం సేపు గడిచాక అయన ఆ మనిషితో, "నువ్వు ఆ నీడన పడుకుని నిద్రపో. నువు నిద్రపోవటం చూడాలని ఉన్నది." అన్నాడు.

"ఇంకా నయం! సాయంత్రం లోపల ఈ పని పూర్తి కావాలి." అన్నాడు చెట్టు కొట్టేవాడు.

"దాన్నిగురించి భయపడకు. నీ పని నేను చేసి పెడతాను," అంటూ రాజు ఆ మనిషి చేతిలో నుంచి గొడ్డలి తీసుకున్నాడు.

చెట్టు కొట్టేవాడు రాజు కేసి అనుమానంగా చూసి, వెళ్ళి చెట్ల నీడన పడుకుని, మరుక్షణమే నిద్రపోయాడు.

"చిత్రం! ఒక పరుపు లేదు, దిండు లేదు! వీడు ఎలా నిద్రపోతున్నాడో!" అని రాజు ఆశ్చర్యపోయాడు.

అయితే, వాడి పని తాను చేయవలసి ఉన్నది గనక, రాజు గొడ్డలితో చెట్టు కొట్టసాగాడు. త్వరలోనే ఆయనకు చెమట పట్టింది. చొక్కా విప్పెయ్యవలసి వచ్చింది.

చెట్టు కొట్టటం ఎలాగైతేనేం పూర్తి అయింది. రాజు చేతులు బొబ్బ లెక్కాయి. నడుమూ, చేతులూ తీపు పెడుతున్నాయి. ఆయన వెళ్ళి చెట్టు కొట్టేవాడి పక్కనే నేల మీద నడుము వాల్చాడు. కొద్ది క్షణాలకల్లా ఆయన కళ్ళు బరువెక్కి, మూసుకుపోయాయి. ఆయన గాఢనిద్రలో పడాడు.

సాయంకాల మయింది. ఏయే కూలి వాడు ఎంతెంత పని చేశాడో చూస్తూ తణిఖీ దారు అక్కడికి వచ్చి, కూలివాడు మరొక మనిషి పక్కన పడుకుని గాఢనిద్రలో ఉండటం చూసి, "లేవరా, గాడిదా!" అంటూ వాణ్ణి ఒక్కతన్ను తన్నాడు.

రాజు కళ్ళు తెరిచి చూసి, "ఎందు కలా గావుకేకలు పెడుతున్నావు? వాణ్ణి నిద్రపోనీ, అలిసి ఉన్నాడు!" అన్నాడు.

"నువ్వెవడవు నాకు చెప్పటానికి? నేను ఈ అడివి కంతకూ తణిఖీదారును!" అన్నాడు ఆ ఉద్యోగి పొగరుగా.

రాజుకు పట్టరాని ఆగ్రహం వచ్చింది. "త్రాష్టుడా! వాణ్ణి లేపావో నీ గొంతు నులి మేస్తాను!" అన్నాడాయన పళ్లు కొరుకుతూ.

తణిఖీదారు బెదిరి వెనక్కు తగ్గుతూ, "నేను మళ్ళీ వచ్చి నీ అంతు తేల్చకపోతే చూసుకో!" అని బెదిరించాడు.

ఈ లోపుగా రాజభవనంలో రాజుగారు ఏమై పోయినదీ తెలీక పరివారం ఆయన కోసం వెతక సాగారు. వారిలో కొందరు అడవిలోకి వచ్చి, రాజును బెదిరిస్తున్న తణిఖీదారును చూసి, "ఏమయ్యా, రాజు గారు గాని కనిపించారా?" అని అడిగారు.

"రాజుగారి మాట ఏమోగాని, ఇక్కడ రారాజు ఒకాయన దాపరించాడు. అడుగో!" అంటూ మారు వేషంలో ఉన్న రాజును చూపించాడు తణిఖీదారు.

భృత్యులు రాజును గుర్తించి, "మహా రాజా, తమకోసం రోజల్లా వెతుకుతున్నాం," అన్నారు.

రాజు లేచినిలబడి, తన భృత్యులకు చెట్టు కొట్టినవాణ్ణి చూపి, "మీరీ మనిషిని రాజభవనానికి తీసుకుపోయి, హంసతూలికా తల్పం మీద పడుకోబెట్టండి. తనంతట తాను లేచినదాకా అతన్ని నిద్రపోనియ్యండి. నిద్రలేచాక కడుపు నిండా తిండి పెట్టండి. ఈ మనిషి నా జబ్బుకు చికిత్స చెప్పాడు!" అన్నాడు.

మర్నాడు కట్టెలు కొట్టేవాడు నిద్ర లేచాడు. రాజు అతన్ని అడవి కంతకూ పెద్ద తణిఖీదారుగా వేసి, చాలా సహాయం చేశాడు.






మర్నాడు తెల్లవారగానే కీచకుడు రాజభవనానికి వచ్చి ద్రౌపదిని చూసి, "నా పరాక్రమం చూశావు గదా! నిన్న రాజసభలో నిన్ను తన్నితే ఒక్కడు కూడా నోరెత్తలేక పోయాడు. ఈ విరాటుడు పేరుకే రాజు. సేనలన్నీ నా అధీనంలో ఉన్నాయి. నేనే అసలైన రాజును. అలాటి నా చేత సేవలు చేయించుకుని నన్ను ధన్యుణ్ణి చెయ్యి. నీకు రోజుకు నూరు నిష్కాలు (మాడలు) ఇస్తాను. వందల కొద్దీ దాసదాసీలను ఇస్తాను. మంచి రథం ఇస్తాను," అని మళ్ళీ బతిమిలాడ నారంభించాడు.

"నీకు నిజంగా నేను కావాలంటే, నేను చెప్పిన నియమాలకు లోబడాలి. మన రహస్యం రాజసభకు గాని, నీ తమ్ములకు గాని ఏ మాత్రమూ తెలియరాదు. ఈ రహస్యం బయటికి పొక్కిందో గంధర్వులు తప్పక తెలుసుకుంటారు. అదే నా భయం. ఇందుకు నువు ఒప్పుకుంటే నేను నీ దానను అవుతాను," అని ద్రౌపది అన్నది.

కీచకుడు, "అలా అయితే ఎవ్వరికీ తెలియకుండా నువు ఉండే చోటికి వస్తాను. గంధర్వులకు ఏ మాత్రమూ తెలియనివ్వను," అన్నాడు.

అప్పుడు ద్రౌపది, "నర్తనశాలలో రాత్రివేళ ఎవరూ ఉండరు. బాగా చీకటి పడినాక అక్కడికి రా. మనం అక్కడ కలుసుకుంటే ఎవరికి తెలీదు. గంధర్వులు కనుక్కోలేరు," అన్నది.



తరవాత ఆమె, తాను కీచకుడితో చేసిన ఏర్పాటు గురించి భీముడికి తెలిపింది.

సైరంధ్రి ఆహ్వానం మృత్యువు పిలుపే నని గ్రహించలేని మూర్ఖుడు, కీచకుడు, ఆమె తనకు దక్కబోతున్నదని నమ్మి, ఆ పగలు ఎలా గడిచినదీ కూడా తెలుసుకో లేక పోయాడు.

ఈ లోపల భీముడికి కీచకుణ్ణి చంపా లన్న ఉత్సాహం మితిమీరి పోయింది. అతను ద్రౌపదితో, "వాణ్ణి రహస్యంగా కాకపోతే బహిరంగంగానే చంపుతాను. వాణ్ణి చంపి అలాగే వెళ్ళి దుర్యోధనుణ్ణి చంపేస్తాను. కావలిస్తే ధర్మరాజును ఈ విరాటరాజు కొలువు చెయ్యనీ!" అన్నాడు ఉద్రేకంతో.

ద్రౌపది అతన్ని నిగ్రహించుతూ, "నువు వాణ్ణి నియమాలు ఉల్లంఘించకుండా చంపు," అన్నది.

"సరే, ఇవాళ రాత్రి చీకటిలో నేనె వరో కూడా వాడికి తెలియరాకుండా నువు చెప్పినట్టే చంపి పారేస్తాను," అన్నాడు భీముడు.

ఆ రాత్రి గాఢాంధకారంలో భీముడు నర్తనశాల చేరుకుని, లేడి రాక కోసం వేచి ఉండే సింహం లాగా కీచకుడి కోసం పొంచి ఉన్నాడు.

త్వరలోనే కీచకుడు రకరకాల అలంకారాలు చేసుకుని, సైరంధ్రి కోసం తహ తహ లాడుతూ నర్తనశాల ప్రవేశించాడు. భీముడు మంచం మీద పడుకుని ఉన్నాడు. కీచకుడు అతన్ని చేత్తో తడువుతూ, "నా అంతఃపురంలో ఎన్నో అలంకారాలు చేయించి, వందల కొద్దీ దాసీలనూ, బోలె డంత ధనాన్నీ నీ కోసం సిద్ధంగా ఉంచాను. నా అంతఃపుర స్త్రీలు నా వంటి అందగాడు ప్రపంచంలో లేడని మెచ్చుకుంటారు. అలాటి వాణ్ణి నీ కోసం ఈ చీకటిలో పడి ఒంటరిగా వచ్చాను," అన్నాడు.

దానికి భీముడు, "నిజంగా నువు అంద గాడివే. కాని ఇలాటి స్పర్శ నువు ఎప్పుడూ అనుభవించి ఉండవు." అంటూ మంచం మీది నించి లేచి, "ఏనుగును సింహం

చంపినట్టు నిన్ను చంపుతాను. సైరంధ్రికి నీ పీడ విరగడ అయిపోతుంది," అంటూ కీచకుడి జుట్టు పట్టుకుని లాగాడు.

కీచకుడు తన జుట్టు విడిపించుకుని భీముడితో కలియబడ్డాడు. జయించాలన్న దీక్షతో ఇద్దరూ భయంకరంగా పోరాడుతూ, చేతులతోనూ, గోళ్ళతోనూ, పళ్ళతోనూ ఒకరి నొకరు హింసించారు. కీచకుడు ఎంత బల మైన దెబ్బలు కొట్టినా భీముడు నిలబడిన చోటి నుంచి కదలకుండా స్తంభం లాగా ఉండి పోయాడు. వారి పోరాటంతో నర్తన శాల కంపించి పోయింది.

ఈ పోరాటం మధ్యలో భీముడు కీచ కుణ్ణి బలంగా కాలితో తన్ని పడదోశాడు. ఆ పాటుకు కీచకుడు కదలక పోవటం చూసి అతని రొమ్ముల్లో బలంగా పొడిచాడు. తర వాత కీచకుణ్ణి చేతులతో పట్టుకుని గిరగిరా తిప్పాడు. కీచకుడి గొంతు పట్టుకుని పిసి కాడు. తరవాత కీచకుడి మీద ఎక్కి మోకాళ్ళతో కుమ్ముతూ పశువును చంపి నట్టు చంపాడు. కీచకుడు చచ్చిన తరవాత కూడా వదలక, అతని కాళ్ళూ, చేతులూ, తలా మొండెంలోకి తోసి, కీచకుడి శవాన్ని ఒక పెద్ద మాంసపు ముద్దలాగా తయారు చేశాడు.

భీముడు ఆ స్థితిలో ఉన్న శవాన్ని కాలితో ఒక్క తన్ను తన్ని, మంట చేసి, దాని



వెలుగులో ఆ శవాన్ని ద్రౌపదికి చూపి, "నిన్ను కామించిన వాడి కెవడికైనా ఇదే గతి!" అని చెప్పి, వంట ఇంటికి వెళ్ళి పోయాడు.

తరవాత ద్రౌపది నర్తనశాలను చూసే సేవకులను లేపి, "కీచకుణ్ణి గంధర్వులు నర్తనశాలలో చంపారు. వెళ్ళి చూడండి." అని చెప్పింది. వాళ్ళు కంగారు పడుతూ దివిటీలు వెలిగించి నర్తనశాలలో ప్రవేశించి, అమానుషంగా చంపబడిన కీచకుడి శవాన్ని చూసి, కాళ్ళూ, చేతులూ, మెడా ఎక్కడ ఉన్నదీ పోల్చలేకపోయారు.

అక్కడ ఉండే కీచకుడి బంధువులు శవం చుట్టూ చేరి ఏడవసాగారు. తాబేలు



లాగా అయిపోయిన కీచకుడి శవం చూసి వారికి కంపరం పుట్టింది. శవానికి సంస్కారం చెయ్యాలి గనక ఉపకీచకులు దాన్ని తీసుకుపోయే యత్నంతో ఉండగా, దగ్గిరలోనే ఒక స్తంభాన్ని కౌగలించుకుని ఉన్న సైరంధ్రి వారి కంట పడింది.

"దీని కోసమే మన అన్న చచ్చాడు. దీన్ని కూడా మన అన్న శవంతో బాటు దహించితే అతడికి సంతోషం కలుగుతుంది," అనుకుని ఉపకీచకులు విరాటుడితో ఆమెను కీచకుడితో పాటు దహనం చేస్తామనీ, అందుకు అనుమతి ఇవ్వమనీ అన్నారు.

విరాటుడు వారికి ఎదురు చెప్పే ధైర్యం లేక సరేనన్నాడు.

ఉపకీచకులు ద్రౌపదిని కీచకుడి శవంతో కలిపి కట్టి, శ్మశానానికి బయలుదేరారు. దారిలో ద్రౌపది గట్టిగా గొంతెత్తి తన భర్తలను వారి రహస్య నామాలతో పిలుస్తూ, "జయా, జయంతా, విజయా, జయత్సేనా, జయద్బలా, ఈ కీచకులు నన్ను పట్టుకుపోతున్నారు," అని కేకలు పెట్టింది.

అప్పుడే పడుకుని నిద్రకు ఉపక్రమించిన భీముడు ఈ కేకలకు లేచి, "సైరంధ్రీ, భయపడకు. నేను వస్తున్నాను," అని కేక పెట్టి, మారు వేషం వేసుకుని, ప్రాకారం దూకి, శ్మశానం కేసి పరిగెత్తాడు.

అతను వెళ్ళేటప్పటికి చితి సిద్ధంగా ఉన్నది. భీముడు అక్కడ ఉన్న ఒక చెట్టును కౌగలించుకుని పెకలించి, దాన్ని ఆయుధంగా పట్టుకుని ఉపకీచకులకు ఎదురు వచ్చాడు.

అతన్ని చూడగానే, "అమ్మో, గంధర్వుడు!" అని అరిచి, ద్రౌపదిని అక్కడే వదిలేసి, ఉపకీచకులు నగరం కేసి పరుగు తీశారు. భీముడు ఆ నూట అయిదుగురునీ వెంట తరిమి చంపి, ద్రౌపది కట్లు విప్పి, "నువు నిశ్చింతగా అంతఃపురానికి తిరిగివెళ్ళు. నేను వంటసాలకు పోతాను," అన్నాడు.

చచ్చి చెట్లలాగా పడి ఉన్న ఉపకీచకులనూ, అంతః పురానికి తిరిగి వెళుతున్న సైరంధ్రినీ చూసిన మనుషులు విరాటరాజు

దగ్గిరికి వెళ్ళి, "మహారాజా, కీచకులందరూ చచ్చారు. గంధర్వులు వాళ్ళను చంపి, సైరంధ్రిని విడిపించారు. ఆమె తిరిగి వస్తున్నది. ఆమె చాలా అందగత్తె. ఆమెను చూసిన వాడికి ఎవడికైనా మోహం పుట్టి తీరుతుంది. ఆమెను మోహించిన వారికి అందరికీ ఇదే గతి పట్టుతుంది. ఆ విధంగా మన నగరమే నాశనమవుతుంది. ఈ సైరంధ్రి కారణంగా మనకు హాని కలగకుండా ఏదైనా పద్ధతి ఆలోచించండి," అన్నారు.

విరాటరాజు వారితో కీచకులందరినీ ఒకే చితిలో దహనం చెయ్యమని చెప్పి, సుధేష్ణ వద్దకు వెళ్ళి "ఆ సైరంధ్రి రాగానే ఆమెను మర్యాదగా పంపించి వెయ్యి. ఆమె కారణంగా గంధర్వుల వల్ల ఏమి పరాభవం జరుగుతుందోనని నేను భయపడుతున్నట్టు ఆమెకు చెప్పు. తనతో చెప్పే ధైర్యం లేక నిన్ను చెప్పమన్నానని కూడా చెప్పు," అన్నాడు.

ద్రౌపది సచేల స్నానం చేసి నగరానికి తిరిగి వస్తుంటే, గంధర్వుల భయం కొద్దీ కొందరు ఆమెను చూసి పారిపోయారు, మరి కొందరు కళ్ళు గట్టిగా మూసుకున్నారు.

ఆమె వంటసాల సమీపంలోకి వచ్చే సరికి భీముడు వాకిలి దగ్గిర ఏనుగులాగా నిలబడి ఉన్నాడు. అతన్ని చూసి ద్రౌపది చిన్నగా, "నన్ను కాపాడిన గంధర్వరాజుకు నమస్కారం," అన్నది. "నిన్ను సేవిస్తూ ఇక్కడ తిరిగే వాళ్ళు ఋణవిముక్తులైనారు," అన్నాడు భీముడు.





ద్రౌపది ముందుకు కదిలి నర్తనశాల వద్దకు చేరి, అక్కడ రాజకుమార్తెలకు నృత్యం నేర్పుతున్న అర్జునుణ్ణి చూసింది. ఆమెను చూడగానే నర్తనశాలలో ఉన్న అర్జునుడూ, రాజకుమార్తెలూ ఆమె వద్దకు వచ్చి, గొప్ప ప్రమాదం నుంచి బయట పడినందుకు ఆమెను అభినందించారు.

అర్జునుడు, "సైరంధ్రీ, నువు ఎలా బయట పడ్డావు? ఆ దుర్మార్గులు ఎలా చచ్చారు? చెప్పవా?" అని ద్రౌపదిని అడిగాడు.

"బృహన్నలా, ఎందుకు అడుగుతావు? నువు ఆర్చగలదీ, తీర్చగలదీ ఏమన్నా ఉన్నది గనకనా? సుఖంగా కన్యాంతఃపురంలో కూర్చుని, ఈ సైరంధ్రి గతి ఏమయినదీ తెలియకుండానే, నవ్వుతూ అడగ వచ్చావు!" అని ద్రౌపది అర్జునుణ్ణి దెప్పి పొడిచింది.

"నీతో ఇంతకాలం స్నేహంగా ఉన్న నాకు నిన్ను గురించి దుఃఖం ఉండదా? ఒకరి మనస్సు ఒకరికేం తెలుస్తుంది?" అన్నాడు అర్జునుడు.

ద్రౌపది రాజకుమార్తెలతో సహా రాజుగారింటికి వెళ్ళేసరికి సుధేష్ణ తన భర్త చెప్పమన్నట్టుగానే, "నిన్నూ, నీ గంధర్వులనూ గురించి రాజుగారు చాలా భయపడుతున్నారు. నువు మరెక్కడికైనా వెళ్ళిపో. నీ అందం చూస్తే ఎలాటి వారికైనా మతి చెడుతుంది. గంధర్వులు చూడబోతే మహా కోపిష్ఠి వాళ్ళుగా ఉన్నారు," అన్నది.

"అమ్మా, ఇంకా పదమూడు రోజులు రాజుగారు నన్ను క్షమించినట్టయితే గంధర్వులు నన్ను తీసుకుపోతారు. ఆ తరవాత రాజుగారూ, వారి బంధువులూ, మిత్రులూ సుఖంగా ఉండవచ్చు." అని ద్రౌపది వేడింది.

మహా బలవంతులైన కీచకుడు తమ్ములందరితో సహా చచ్చిపోవటంతో విరాట నగరంలో వాళ్ళు చాలా బాధపడ్డారు. ఎవరో ఆడదాని మూలాన కీచకుణ్ణి గంధర్వులు హత్య చేశారన్న వార్త దేశ దేశాలా వ్యాపిం

చింది. ఇదేసమయానికి దుర్యోధనుడి చారులు పాండవుల జాడ కోసం అనేక దేశాలూ, కొండలూ, తీర్థాలూ, గ్రామాలూ గాలించి హస్తినాపురానికి తిరిగి వచ్చి, ఎక్కడా పాండవుల అచూకీ దొరకనట్టు చెప్పారు. పాండవులు చచ్చిపోయి ఉండవచ్చునని వాళ్ళు ఊహించారు. కీచకుణ్ణి గంధర్వులు చంపారన్న వార్త కూడా వాళ్ళే తెచ్చి, "ఆ గంధర్వులు ఎవరికీ కనిపించలేదట," అన్నారు.

దుర్యోధనుడు తన సభలో ఉన్న వారితో, "ఏం చెయ్యాలో తెలియటంలేదు. మీరు కూడా ఆలోచించండి. పాండవుల అజ్ఞాత వాసం ఇంకా కొంచెమే మిగిలి ఉన్నది. గడువు దాటేలోగా వారి జాడ తెలుసుకున్నామంటే మాటకు కట్టుబడి ఉండే ఆ పాండవులు తిరిగి పన్నెండేళ్ళు వనవాసం ప్రారంభిస్తారు," అన్నాడు.

కర్ణ దుశ్శాసనులు మళ్ళీ చారులను పంపమన్నారు. వాళ్ళు తప్పక బతికే ఉంటారనీ, వారిని వెతకటానికి వాళ్ళ సంగతి తెలిసిన చారులను పంపమనీ ద్రోణుడు అన్నాడు. భీష్ముడు కూడా పాండవులు బతికే ఉన్నారని ఊహిస్తూ, "ధర్మరాజు ఉండే దేశం సుభిక్షంగా ఉంటుంది. అక్కడి ప్రజలు సంతృప్తితోనూ, ధర్మపరులుగానూ జీవిస్తూ ఉంటారు. వర్షాలు సక్రమంగా కురుస్తాయి. అలాటి దేశం కోసం వెతికించు," అన్నాడు.

తరవాత కృపాచార్యుడు దుర్యోధనుడితో, "భీష్ముడు చెప్పినది నిజం. ఒక వంక పాండవుల కోసం వెతుకుతూ, మనం చెయ్యవలసిన పని ఒకటి ఉన్నది. పాండవులు అజ్ఞాతవాసం ముగించగలిగితే రాజ్యం కోసం యుద్ధం చేసి తీరుతారు. అందుచేత మనం మన బలాలనూ, ధనాన్నీ, రాజ నీతినీ పెంపొందించుకోవాలి. సామ దాన భేద దండోపాయాలు ప్రయోగించి బలవంతులనూ, బలహీనులనూ మన పక్షం చేసుకోవాలి, కోశం నింపుకోవాలి. అలా అయితే పాండవుల పక్షాన పోరాడే రాజులనందరినీ యుద్ధంలో జయించి సుఖపడతావు." అన్నాడు.







# శివపురాణం

## 17

బ్రహ్మవల్ల వరాలు పొందిన శంఖచూడుడు, బ్రహ్మ ఆదేశాన్ని అనుసరించి బదరికాశ్రమానికి వచ్చి, తులసి అనే కన్య తపస్సు చేసుకుంటూ ఉండగా చూశాడు. ఆమె దివ్యసౌందర్యం చూడగానే శంఖచూడుడికి మోహం కలిగింది.

అతను ఆమెను సమీపించి, "సుందరీ, నువ్వు ఎక్కడి దానివి? ఈ వనంలో ఒంటరిగా ఎందుకు ఉంటున్నావు?" అని అడిగాడు.

తులసి కూడా శంఖచూడుణ్ణి చూసి, అతని అందానికి మురిసిపోయి, "నేను ధర్మధ్వజు డనే రాజుకూతుర్ని. నా పేరు తులసి. నాకు మహావీరుడు భర్త కావాలనీ, మహా పతివ్రతగా నాకు శాశ్వత కీర్తి రావాలనీ కోరి తపస్సు చేస్తున్నాను. నువ్వు ఎవరు?" అని అడిగింది.

"నేను దంభుడు అనే దానవరాజు కొడుకును. నా పేరు శంఖచూడుడు. నేను బ్రహ్మను గురించి తపస్సు చేసి త్రిలోకాధిపత్యం వహించేటట్టు వరం పొందాను. నిన్ను పెళ్ళాడమని బ్రహ్మ నన్ను ఆదేశించాడు. అందుచేత మనం భార్యాభర్తలమై సుఖంగా ఉండవచ్చు," అని శంఖచూడుడు ఆమెతో అన్నాడు.

వాళ్ళు అప్పుడే గాంధర్వ వివాహం చేసుకుని, కొండలలోనూ, నదుల వెంబడీ, వనాలలోనూ కొంతకాలం విహారాలు చేసి, తరవాత శంఖచూడుడి ఇంటికి వెళ్ళి, జరిగిన సంగతులన్నీ దంభుడికీ, ఆయన భార్యకూ, శుక్రాచార్యుడికీ చెప్పారు. వారంతా సంతోషించారు. తరవాత దంభుడు శుక్రాచార్యుడి అనుమతితో, శంఖచూడుడికి రాజ్యాభిషేకం చేశాడు.

---

అట్ట చివరి బొమ్మ

---



శంఖచూడుడు తండ్రి నుంచి పొందిన రాజ్యాన్ని, శుక్రాచార్యుడి సలహాల ననుసరించి చక్కగా పాలిస్తూ దానవ శ్రేష్ఠుడన్న కీర్తి సంపాదించుకున్నాడు. ఇలా అతను పరిపాలన చేస్తూ ఉండగా ఒకనాడు కొందరు దానవ ప్రముఖులూ, శుక్రాచార్యుడూ అతనితో, "రాజా, బ్రహ్మ నీకు అపూర్వమైన వరాలు ఇచ్చి ఉన్నాడు. నీ పూర్వులకు దేవేంద్రుడు మొదలుగాగల దేవతలు అనేక ద్రోహాలు చేశారు. వాటికి ప్రతీకారం చేసే బాధ్యత నీపైన ఉన్నది. ముందు నువు నీ సేనలతో వెళ్ళి, స్వర్గాన్ని ముట్టడించి, దేవతలను తరిమివేసి, స్వర్గాన్ని వశపరుచుకో," అని హితం చెప్పారు.

శంఖచూడుడు వాళ్ళు చెప్పినట్టే చేయ నిశ్చయించి, శుక్రాచార్యుణ్ణి మంచి ముహూర్తం చూడమని చెప్పి, ఆ ముహూర్తానికి తన సేనలతో వెళ్ళి, స్వర్గాన్ని ముట్టడించాడు.

శంఖచూడుడు స్వర్గం మీదికి దండెత్తి వస్తున్న వార్త చారుల వల్ల ముందేవిని, దేవేంద్రుడు కుమారస్వామినీ, దేవగణాల వాళ్ళనూ పిలిపించి, తాను కూడా యుద్ధానికి సిద్ధమయాడు.

దేవగణాలకూ, దానవగణాలకూ నలభై రోజుల పాటు అహోరాత్రాలు దారుణమైన యుద్ధం జరిగింది. యుద్ధంలో వెనక్కు తగ్గటం అన్నది దేవతలలో కనిపించింది గాని దానవులలో కానరాలేదు. దానవులు స్థిరంగా నిలబడి పోరాడుతూ ఉంటే దేవతలు పారిపోసాగారు.

అది చూసి ఇంద్రుడు, తనకు విజయం సాధ్యం కాదని గ్రహించి, శంఖచూడుడికి బ్రహ్మ ఇచ్చిన వరాలు ఉండటం జ్ఞాపకం తెచ్చుకుని, దేవసేనలను యుద్ధభూమి నుంచి మరల్చి, తాను శంఖచూడుడి వద్దకు వెళ్ళి, "శంఖచూడా, నువు కశ్యపమహర్షి సంతతివాడివి. నీ శౌర్య బలపరాక్రమాలకు ఎంతో సంతోషించాను. నువే త్రిలోకాలను పాలించు. మేమంతా నీకు సహాయం చేస్తాం," అన్నాడు.

శంఖచూడుడు ఇందుకు అంగీకరించి, ''దేవేంద్రా, నువే నా ప్రతినిధిగా ఉండి, నా ఆజ్ఞకు లోబడి పరిపాలన సాగించు,'' అన్నాడు. తరవాత అతను తాను త్రిలోకాలకు అధిపతినని ప్రకటన చేసి, తన రాజధాని అయిన శోణితపురానికి వెళ్ళి, అక్కడినుంచే లోకాలన్నిటినీ పాలించ సాగాడు. దేవేంద్రుడు మొదలైనవారు రోజూ అతన్ని సేవిస్తూ, అతని ఆజ్ఞలు నిర్వర్తిస్తున్నారు.

అయితే యజ్ఞయాగాదులు చేసే వాళ్ళు హవిర్భాగాలను ఇంకా దేవేంద్రుడు మొదలుగాగల వారికే ఇస్తున్నారు. ఆ హవిర్భాగాలు దానవులకు ఇచ్చేదాకా ఋషులనూ, బ్రాహ్మణులనూ బాధించమని శంఖచూడుడు తన దానవ మూకలను హెచ్చరించాడు. వాళ్ళు వెళ్ళి యజ్ఞయాగాదులను ధ్వంసం చెయ్యసాగారు.

ఋషులందరూ విష్ణువు వద్దకు వెళ్ళి, ''శంఖచూడుడు పెట్టే బాధలు పడలేకుండా ఉన్నాం. వాణ్ణి చంపి మమ్మల్ని కాపాడు,'' అని మొరపెట్టుకున్నారు.

''శంఖచూడుడు నా అంశన పుట్టినవాడు. అతని భార్య తులసి లక్ష్మిఅంశన పుట్టినది. అందుచేత నేను శంఖచూడుణ్ణి చంపను. మీరు శివుణ్ణి ఆశ్రయించండి,'' అన్నాడు విష్ణువు.



అప్పుడు ఋషులందరూ కైలాసానికి వెళ్ళి, తమను శంఖచూడుడు పెట్టే బాధల నుండి కాపాడమని శివుణ్ణి వేడుకున్నారు. శంఖచూడుడు మొదలైన దానవులను తాను చంపుతానని మాట ఇచ్చి, శివుడు వారిని పంపేశాడు.

ఈ సంగతి తెలిసి నారదుడు శంఖచూడుడి వద్దకు వెళ్ళి, ''నిన్ను చంపుతానని శివుడు ఋషులకు మాట ఇచ్చాడట. ఆయన హఠాత్తుగా రుద్రగణాలతో వచ్చి పడేదాకా చూస్తూ ఊరుకోక, ముందు నువే సర్వసైన్యాలతో దాడి వెళ్ళి కైలాసాన్ని ముట్టడించి, శివుణ్ణి జయించు,'' అని సలహా ఇచ్చి వెళ్ళిపోయాడు.

శంఖచూడుడు నారదుడి మాట ప్రకారం తన సేనలతో వెళ్ళి, కైలాసాన్ని ముట్టడించాడు. అది చూసి శివుడు అతనితో యుద్ధం చెయ్యటానికి భద్రకాళినీ, వీరభద్రగణాలనూ, కుమారగణాలనూ నంది చేత పిలిపించాడు. రుద్రగణాలకూ, దానవ సేనలకూ యుద్ధం ప్రారంభమయింది.

ఎంత కాలం యుద్ధం సాగినా శంఖచూడుడి సేనలు తరగక పోవటం శివుడికి ఆశ్చర్యం కలిగించింది. ఆయన విష్ణువును స్మరించి రప్పించి, "ఎన్నాళ్ళుగా యుద్ధం చేస్తున్నా శంఖచూడుడి సేనలు తరగవెందుచేత?" అని అడిగాడు.

దానికి విష్ణువు, "శంఖచూడుడి భార్య తులసి పాతివ్రత్యం అతనినీ, అతని సేనలనూ కాపాడుతున్నది. నేను తులసి పాతివ్రత్యం చెడగొట్టుతాను. అప్పుడు నువ్వు శంఖచూడుణ్ణి చంపు." అన్నాడు.

విష్ణువు శంఖచూడుడి రూపు ధరించి అతని ఇంటికి వెళ్ళి, తులసితో, "శివుడితో యుద్ధం చేస్తున్నాను. జయాపజయాలు తేలలేదు. నిన్ను చూసి చాలాకాలమయిందని వచ్చాను." అన్నాడు. తులసి ఆ మాట నమ్మి సంతోషించి, ఆ మాయ శంఖచూడుడికి భార్యగా మసలు కున్నది. ఆ విధంగా ఆమె పాతివ్రత్యం నశించింది.

వెంటనే శంఖచూడుడి సేనలు విపరీతంగా నష్టం కాసాగాయి. శివుడు శంఖచూడుణ్ణి తన త్రిశూలంతో చంపేశాడు.

ఆ రాత్రి విష్ణువు తన పక్కన నిద్రపోయేటప్పుడు తులసి అతని అసలు స్వరూపాన్ని కళ్ళారా చూసింది. ఎందుకంటే మాయా రూపాలు నిద్రలో పోతాయి. మాయా రూపంతో తనను మోసం చేసిన విష్ణువును శిల అయిపొమ్మని తులసి శపించింది.

"నువు గండకీ నదివై పోతావు. నేను సాలగ్రామాల రూపంలో ఆ నదిలో శాశ్వతంగా ఉంటాను. నీ పేర తులసిచెట్టు అంతటా పూజించబడుతుంది," అని చెప్పి, విష్ణువు ఆమెను గోలోకానికి తీసుకుపోయాడు.



ప్రపంచపు వింతలు :

# 127. "సృష్టికి నడిబొడ్డు"

ఈ చిత్రంలో దిగువ నున్న వలయాలలో మధ్య నున్న దాన్ని చీనాచక్రవర్తులు "స్వర్గవేదిక" అని పిలిచి, అక్కడ ప్రార్థనలు చేసి హవిస్సులు వ్రేల్చేవారు. వారి దృష్టిలో ఇది విశ్వాని కంతటికీ నడి బొడ్డు. ఈ వలయపు వేదికలకు ఎగువ నున్నదంతా రాజప్రాంగణం.



Chandamama, June '72

Photo by Suraj N. Sharma



బహుమతి
పొందిన వ్యాఖ్య

పందెంలో ప్రథమం

పంపినవారు:
డా. కె. పాండురంగారావు

Chandamama, June '72

Photo by Suraj N. Sharma



కదిరి.
(అనంతపూర్ జిల్లా.)

అందంలో అధమం

బహుమతి
పొందిన వ్యాఖ్య

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు







★ వ్యాఖ్యలు జూన్ నెల 20 వ తేదీలోగా చేరాలి.

★ వ్యాఖ్యలు ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలోగాని వుండాలి. రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి. గెలుపొందిన వ్యాఖ్యలు ఆగష్టు నెల సంచికలో ప్రకటించబడును.

# చందమామ

### ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు




Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Chandamama Publications, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'

X

# బేబీ దొంగరవాణా పట్టుకున్నాడు






























dCP/GLT/11c TL

